# సమర్థ సద్గురు


ఆధ్యాత్మిక మాసపత్రిక

శ్రీకాళీగార్డెన్స్ ఆశ్రమం - 522508, గుంటూరు జిల్లా

ఫోన్ : (0863) 2293280, 2293564, 2293206

web: www.mathaji-babuji.org samardhasadguru@rediffmail.com





Volume 29 Issue 4

No.of Pages 40

DECEMBER 2009

| | | |
|---|---|---|
| **5సం॥ల చందా** | **రు.** | **250.00** |
| **2సం॥ల చందా** | **రు.** | **120.00** |
| **సంవత్సర చందా** | **రు.** | **60.00** |
| **విడిప్రతి వెల ..... ..** | **రు.** | **5.00** |

బ్యాంక్ డ్రాఫ్ట్స్ A/C.Y.S.C.K.P.M చారిటబుల్ ట్రస్ట్ పేరులో డ్రా చేయండి. M.O.,బ్యాంక్ డ్రాఫ్ట్స్ పంపవలసిన చిరునామా:

మేనేజరు

సమర్థసద్గురు మాగజైన్

శ్రీకాళీగార్డెన్స్-522508

Printed, Published by C.V. Ramana Babu, on behalf of YOGINI SRI CHANDRA KALI PRASADA MATHAJI CHARITABLE TRUST and Printed at Samardha Sadguru Publications, D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh, and published at D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh. Editor - Guda Siva Rama Murthy,


**ఈ సంచికలో....** **పేజీ**


| | |
|---|---|
| భద్రవాక్యం | 2 |
| అమ్మఆశీస్సులు | 3 |
| సంపాదకీయం | 4 |
| బాబూజీ ఉవాచ | 5 |
| మాతాజీఅభిభాషణ | 8 |
| సన్నిధిలోసంభాషణ | 11 |
| శ్రీకాళీగార్డెన్స్‌లో విశేష పూజా కార్యక్రమాలు | 13 |
| సత్సంగసౌరభం | 14 |
| సంత్‌నామదేవ్ చరితామృతం | 16 |
| గురుకృప | 19 |
| శ్రీకృష్ణ కర్ణామృతం | 22 |
| మౌనధ్యాన సప్తాహ శిబిరం | 25 |
| మాతాజీబోధామృతం | 28 |
| మాతాజీ సత్సంగ్ డైరీ | 31 |
| శ్రీబాబూజీ దివ్యవాణి | 33 |
| సమర్థ సద్గురు నాధుని చరిత్ర | 35 |
| శ్యామసుందరా! ఒక్కసారి! | 38 |

# భద్రవాక్యం

**శ్లో॥ నజాయతే మ్రియతేవా విపశ్చి**
**న్నాzయం కుతశ్చిన్న బభూవ కశ్చిత్**
**అజోనిత్యం శాశ్వతోzయం పురాణో**
**న హన్యతే హన్యమానే శరీరే ॥**

-కఠోపనిషత్

ఈ పై మంత్రం కఠోపనిషత్తు ద్వితీయ వల్లిలోని పదునెనిమిదవ మంత్రము. మంద, మధ్యాధికారులను దృష్టిలో ఉంచుకొని ఓంకార ఆలంబన ఉపాసనమును, ప్రతీకోపాసనను చెప్పి, యముడు నచికేతునకు ఇప్పుడు నిరుపాధిక ఆత్మస్వరూపమును ఈ మంత్రంలో వివరిస్తున్నాడు.

నిత్యమూ, చైతన్యమే స్వభావమూ అయిన నిరుపాధిక బ్రహ్మ తత్వమునకు చావుపుట్టుకలు లేవు. అది ఆద్యంత రహితం. సర్వకారణములకు కారణము. అనగా అది మరొకకారణాంతరము వలన పుట్టలేదు. ఈ నిరుపాధికమైన ఆత్మతత్వమునుండి మరొక వస్తువు ఏదీ పుట్టుట లేదు. దీనికన్న అన్యమైనది కూడ ఏదీ లేదు. ఈ ఆత్మతత్వము శాశ్వతమైనది, సనాతనమైనది. శరీరములు నశిస్తున్నా ఈ ఆత్మ తత్వము నశింపక నిత్యంగా ఉంటుంది. భగవానుడు అర్జునుడికి సాంఖ్యయోగములో దీనినే

**శ్లో॥ నజాయతే మ్రియతేవా కదాచిత్**
**నాయంభూత్వా భవితావా న భూయః**
**అజోనిత్యం శాశ్వతోzయం పురాణో**
**న హన్యతే హన్యమానే శరీరే ॥** -భగవద్గీత 2/20

అంటే అర్జునా ఈ ఆత్మకు చావుపుట్టుకలు లేవు, ఒకప్పుడు ఉండి మరొకప్పుడు లేకపోవటం అనేది లేదు. అది సనాతనము, నిత్యము. శరీరము చంపబడవచ్చు గాని ఆత్మకు చంపబడటం అనేది లేదు. దేహి రాకపోకలు లేక ఉంటాడు. శరీరంపై జీర్ణవస్త్రాలు పోయి నూతన వస్త్రాలు వస్తున్నట్లే దేహికి శరీరాలు పోతూ వస్తూ ఉంటాయి. వీటినే గిట్టటం, పుట్టటం అని వ్యవహరిస్తారు. విజ్ఞులైన వారు వీటికి దుఃఖించరు అని చెప్తాడు.

మనకు కూడ ఆత్మానుభూతి కలగగానే మనం నిత్యులము అన్న సత్యం అనుభవానికి వచ్చి, దుఃఖం కేవలం ఆగంతుకం అని తెలిసి దుఃఖం నశిస్తుంది. *

# అమ్మ ఆశీస్సులు

**అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యంతే మామబుద్ధయః।**
**పరంభావమజానంతో మమావ్యయమనుత్తమమ్ ॥**

భగవానుడు అర్జునునికి గీతోపదేశం చేస్తూ "నేను శాశ్వతుడను, సర్వోత్తముడను, ఇంద్రియాలకు, మనస్సుకు అగోచరుడను. అట్టి నా పరమ భావమును, నేను అందరికన్న శ్రేష్టుడనని గ్రహించలేని మూఢులు నన్ను సామాన్య మానవునిగా తలచుచున్నారు" అని చెప్పాడు. అట్టి పరబ్రహ్మ తత్త్వము మనను ఉద్ధరించుటకై ఒక రూపం ధరించి వచ్చి, మనతో మెలిగి తిరిగి స్వస్వరూపలయాన్ని పొంది 21 సంవత్సరాలైన సందర్భంగా మనం శ్రీ సద్గురుదేవుల పుణ్యారాధన పంచయజ్ఞ విధులతో అత్యంత వైభవంగా జరుపు కొన్నాము. శ్రీగురుదేవుల అనుగ్రహంతో పరమపూజ్య శ్రీ విద్యాస్వరూపానందగిరి స్వామివారు, శ్రీ శుకబ్రహ్మాశ్రమం, శ్రీ కాళహస్తి, శ్రీ దండి నిర్మలానందగిరి స్వామివారు, అష్టలక్ష్మి పీఠం, తెనాలి, శ్రీ నిర్మలానందగిరి స్వామివారు, శ్రీ గురు ఆశ్రమం, బళ్ళారి, చింతలపూడి ఆశ్రమంనుండి శ్రీమాతా శివానంద గారు ఈ ఆరాధనోత్సవాలలో పాల్గొని భక్తులకు తమ ఆధ్యాత్మిక సందేశాలను అందించారు. కట్టమూరులో బాబూ భక్త సమాజ్ వారు శ్రీ సద్గురు దేవులు వ్యక్త స్వరూపం వదలి సర్వవ్యాపకమై అవ్యక్త రూపాన్ని ధరించిన మాసంలో శ్రీ సమర్థ సద్గురు పంచాయతన యాగ సహిత సత్సంగ సమావేశ సప్తాహాన్ని, శ్రీ సద్గురు దేవుల పాద పూజను నిర్వహించారు.

శ్రీ గురుదేవుల పరమకృపా విశేషం వలన వారి సందేశాన్ని విశ్వవ్యాప్తం చేయటానికి ఈ నెల 6,8 తేదీలలో ఆస్ట్రేలియాలో జరిగే ప్రపంచ సర్వమత సమ్మేళనం(Conference of World Parliament of Religions)లో పాల్గొనేందుకు ఆస్ట్రేలియా వెళ్తున్నాను. ది 6న Meditation and sacred Music, (ధ్యాన ప్రక్రియ సంకీర్తనాదులు), ది 8న Sharing Wisdom is the secret for inner peace (జ్ఞానబోధ అందరికీ పంచటమే చిత్త శాంతికి మార్గము) అనే అంశాలపైన శ్రీ గురుదేవులు మీ అమ్మ ద్వారా ఏం ప్రవచనం చేస్తారో!

ఈ నెల 16నుండి ఆశ్రమంలో ధనుర్మాస కార్యక్రమాలు ప్రారంభ మవుతాయి. నా బిడ్డలు అందరూ తిరుప్పావై, ఋషుల చరిత్రలు, భాగవత శ్రవణము మొదలైన కార్యాక్రమాలలో పాల్గొని ఆనందించి, ఆ సమయాన్ని మీ నిత్య కాలంలో జమ చేసుకుంటారు కదూ!

-మీ అమ్మ

# సంపాదకీయం

శ్రీ సద్గురు దేవుల ఏకవింశతి పుణ్యారాధన మహోత్సవాలు పంచ యజ్ఞవిధి పూర్వకంగా, అత్యంత భక్తి భరితంగా, వైభవోపేతంగా జరిగాయి. పరమహంస పరివ్రాజక పూజ్యపాద శ్రీశ్రీశ్రీ విద్యాస్వరూపానందగిరి స్వామివారు, శుక బ్రహ్మాశ్రమ పీఠాధిపతులు, శ్రీకాళహస్తి, పరమహంస పరివ్రాజక పూజ్యపాద శ్రీశ్రీశ్రీ 108 దండి నిర్మలానందగిరి స్వామి వారు, అష్టలక్ష్మీ పీఠాధిపతులు, తెనాలి, పరమహంస పరివ్రాజక పూజ్యపాద శ్రీశ్రీశ్రీ మాతా జ్యోతిర్మయానంద భారతి వారు, పరబ్రహ్మ షణ్ముఖానంద ఆశ్రమ పీఠాధిపతి, పాలకొల్లు, పరమహంస పరివ్రాజక పూజ్యపాద శ్రీశ్రీశ్రీ నిత్యానంద భారతి స్వామివారు, శ్రీ గురు ఆశ్రమం, బళ్ళారి, పరమహంస పరివ్రాజక పూజ్యపాద శ్రీశ్రీశ్రీ మాతా శివానందవారు, చింతలపూడి ఆశ్రమం ఆరాధన ఉత్సవాలలో పాల్గొని భక్తులకు తమ దివ్యబోధామృతాన్ని అనుగ్రహించారు. శ్రీ మనోజ్ ప్రసాద్ గురుతత్వాన్ని, ప్రత్యేకంగా నివృత్తినాథుల, జ్ఞానదేవుల, నామదేవుల, ఏకనాథ్‌ల, తుకారామ్‌ల,ఇతర పండరినాధుని భక్తుల జీవిత గాధలలోని విశేష సంఘటనల ఆధారంగా ప్రతిరోజు ప్రవచనం చేశారు. ఆశ్రమంలో కార్యక్రమాలు ముగుస్తూనే పెద నిండ్రకొలను శాఖలో కార్యక్రమాలు యథావిధిగా జరిగాయి.

నవంబరు 21నుండి 27 వరకు కట్టమూరులో మహాత్ముల శోభాయాత్రతో ప్రారంభమైన శ్రీ సమర్థ సద్గురు పంచాయతన యాగ సత్సంగ సప్తాహ కార్యక్రమం ఎంతో శోభాయమానంగా జరిగింది. పూజ్య యోగిని శ్రీ చంద్ర కాళి ప్రసాద మాతాజీ వారే కాక పరమహంస పరివ్రాజక పూజ్యపాద శ్రీశ్రీశ్రీ 108 దండి నిర్మలానందగిరి స్వామి వారు, అష్టలక్ష్మీ పీఠాధిపతులు, తెనాలి, పరమహంస పరివ్రాజక పూజ్యపాద శ్రీశ్రీశ్రీ శంకరానంద గిరిస్వామి వారు, పరబ్రహ్మ ఆశ్రమం, పెనమలూరు, పరమహంస పరివ్రాజక పూజ్యపాద శ్రీశ్రీశ్రీ మాతా విద్యా పరానంద భారతి వారు, యాచారం మొదలైన మహాత్ములు, ఆశ్రమ భక్తులు ఆ కార్యక్రమాలలో పాల్గొని తమ దివ్య సందేశాలను అందించారు. ది.27న కార్యక్రమానికంతటికీ హైలైట్‌గా శ్రీ సద్గురు దేవుల పాదపూజా మహోత్సవం జరిగింది. కట్టమూరు బాబు భక్త సమాజ్ కార్యకర్తలు అందరికీ అన్ని వసతులూ కల్పించి కార్యక్రమాన్ని ఎంతో సమర్థవంతంగా నిర్వహించారు.

ఈ నెల16వ తేదీ నుండి ఆశ్రమంలో చూత వృక్ష ఛాయలో ధనుర్మాస కార్యక్రమాలు ప్రారంభం అవుతాయి. వివరాలు 13వ పేజి లో చూడవచ్చు.

చివరగా ఆంగ్ల కాల మానం ప్రకారం శ్రీ సద్గురు దేవులు వ్యక్త రూపాన్ని ఉపసంహరించి స్వస్వరూప స్థితిని పొందిన రోజు ఈ నెల ది.3వ వస్తుంది. భక్తులందరూ ముఖ్యంగా లక్ష్యార్థాన్ని స్వీకరించిన భక్తులు శ్రీ సద్గురు దేవుల స్మరణలో, ధ్యానంలో గడప వలసిన రోజు. *

- గౌరవ సంపాదకుడు

# బాబూజీ ఉవాచ

(గత సంచిక తరువాయి) - స్వామి విజయేశ్వరానంద ప్రసాద్

భౌతిక విషయాలపై ఉంచిన మనస్సు ఆ భౌతిక రూపాలనే పొందుతుంది. అలాకాక, మనస్సును నిరంతరం ఆ ప్రభువు కమనీయాకృతి పైనే నిలపటం అభ్యసిస్తే, అది అక్కడే నిలిచిపోతుంది. నిరంతరమూ అభ్యాసం చేస్తే, ఒక కోడిగుడ్డును దాని కొనపై నిలబెట్టవచ్చును. అలాగే మనం ఏ పని చేస్తున్నా, మనస్సును భగవంతుని యందు ఉంచితే, గాలిలేని దీపంవలె మనస్సు పూర్తిగా భగవానుని యందు నిలిచిపోతుంది. అలా నిలిచిన కొలది అజ్ఞానం నశించి ఆనందం మిగిలిపోతుంది.



జీవుడనే స్త్రీ, పరమాత్ముడనే తన పురుషుని నుండి విడిపోయినపుడు పొందే అశాంతి, ఆవేదన అంతులేనిది. వేణుగోపాల స్వామివారి తిరణాలకు వచ్చిన నూతన దంపతులు ఆ సందడిలో తప్పిపోయి విడిపోయారు. భార్య పోలీసు స్టేషనుకు వెళ్ళి రిపోర్టు యిచ్చింది. మైకుల్లో ప్రకటించారు. అలా విడిపోయిన పురుషులెందరో వచ్చారు. పోలీసులు వారందరినీ వరుసగా ఆమెకు చూపించారు. ఆమె ఒక్కొక్కరిని కాదంటూ, తన భర్త కనపడేసరికి అంతులేని ఆనందంతో ఒకరినొకరు అలుముకుపోయారు. శాంతిని పొందారు. అలాగే మానవుడు భగవానుని కోసం వెదుక్కోవాలి. అన్నిటిలోనూ భగవానుడు ఉన్నా, ఆయనకు మనకు అడ్డుగా ఉన్న నాలుగింటినీ, అంటే మనో, బుద్ధి, చిత్త, అహంకారాలను తొలగించుకోవాలి. అలా తొలగించుకొని ఆయన దర్శనం పొందితే యిక శాశ్వత శాంతి.

అన్నిటిలోను భగవానుని కోసం వెదుక్కుని, ప్రహ్లాదుడు ధ్రువుడు ఆ పరమాత్మను పొందగలిగారు. వారివలె మనమూ మన నాధుడు, జగన్నాధుడు అయిన ఆ పరమాత్ముని దర్శించినపుడే మనకు సుఖశాంతులు లభిస్తాయి. ప్లీడరుకు పార్టీని చూస్తేనే ఆనందము. భక్తుని దృష్టి సదా భగవానుని మీదనే ఉంటుంది. మానవునిలోని తితీక్ష పెంపొందిన కొలది, నారికేళములోని పువ్వు పెరిగిన కొలది నీరు హరించినట్లు, అతనిలోని కోరికలు, అహంకార మమకారాలు హరిస్తాయి. అతను సర్వ భవబంధముల

నుండి విడబడతాడు. దారాపుత్రాదులుగాని ధనధాన్యాలు గాని యీ బంధముల నుండి మానవుని రక్షించలేవు. ప్రభువొక్కడే రక్షించగలడు.

ప్రభువు దయను సంపాదించాలంటే గురువును ఆశ్రయించాలి. గురువుకు భగవానునికి భేదం లేదు. భగవానుని దర్శించాలనే మన తపన అంటేనే భక్తి. అది పరాకాష్ఠకు చేరుకున్నపుడు, ఆ భగవానుడే మనపై దయతో గురువు రూపంలో వస్తాడు. అట్టి గురువునే పరమాత్మగా గ్రహించి, విశ్వాసంతో ఆశ్రయిస్తే, ఆయన లక్ష్యార్థాన్ని ప్రసాదిస్తాడు. ఆ లక్ష్యార్థాన్ని సాధిస్తేనే తరిస్తాము. వడ్లగింజ తిరిగి ఉత్పన్నమవుతుంది. కాని బియ్యపు గింజ తిరిగి ఎన్నటికీ మొలవదు. వడ్లగింజపైన ఉన్న పొరలు, ఆ పొరలపై ఉన్న నూగు వడ్లగింజ పునర్జన్మకు కారణమైనాయి. అవి తొలగించినందువలన పదార్థమైన బియ్యపు గింజ బయటపడింది. దానికి యిక పునర్జన్మ లేదు. అలాగే అహంకార మమకారములనే పొరలతో కప్పబడిన మానవుడు మళ్ళీ మళ్ళీ జన్మిస్తున్నాడు. ఆ పొరలపై నూగువలె ఉన్న సంకల్పములే తన పునర్జన్మకు కారణ మవుతున్నాయి. గురుకృప వల్ల ఆ రెండూ పొరలూ తొలగినపుడు ఇక మానవునికి పునర్జన్మ లేదు.

'మానవుడు' అన్న మాటలో 'న' అనే అక్షరము అతనిలోని నానాత్వ దృష్టిని సూచిస్తుంది. ఆ అక్షరానికి ఎడమవైపు నుండి ఒక కొమ్మును చేర్చి పైకి కలిపితే 'ధ' అవుతుంది. 'ధ' అనే అక్షరం 'ధీ' అంటే బుద్ధిని సూచిస్తుంది. బుద్ధి అధోదృష్టిని విడిచి పైకి భగవానుని వైపుకు మరలితే, అది సమాధి స్థితిని పొందుతుంది. అప్పుడు 'మానవుడు' 'మాధవుడు' అవుతాడు.

తాను నానాత్వ బుద్ధితో, భేద దృష్టితో, పుడుతూ చస్తూ ఉండే వాడను కానని, చావు పుట్టుకలు, హాని వృద్ధులు లేని శాశ్వత స్వరూపుడైన మాధవుడనేనని మానవుడు తెలుసుకోవటమే జ్ఞానము. అట్టి అనుభవ పూర్వకమైన జ్ఞానం పొందిన మానవునికి యిక చావు లేదు. తిరిగి పుట్టుకాలేదు. అదే మోక్ష స్థితి.

జ్ఞానానికి మూలమే భక్తి. భక్తి అంటే భగవంతుని యందు రక్తి. మానవుడు తనలోని నీచ భావాలను సంకల్పాలను విడిచిపెట్టి, భగవానుని యందు అనురక్తిని పెంపొందిచుకొన్న కొలది భక్తి వృద్ధి పొందుతుంది. భక్తికి పరాకాష్ఠయే జ్ఞానం. జ్ఞానానికి పరాకాష్ఠయే ముముక్షుత్వం.

రేపు, మనం కాళ్ళు చేతులూ కట్టి పడేసినా, అంతటా తిరుగుతూ ఉండేవాణ్ణి గురించి, అంతటా తిరుగుతూనే ఉన్నా, కదలకుండా కూర్చున్న

వాణ్ణి గురించి, బ్రతికి ఉండగానే చనిపోయిన వానిని గూర్చి, చనిపోయిన తర్వాత లేచి తిరుగుతున్న వానిని గూర్చి తెలుసుకుందాము.

అఖండ భక్తి జ్ఞాన వైరాగ్యములను ప్రసాదించి భగవానుడు మిమ్ము సర్వదా కాపాడుగాక.

## 7-10-1978

శ్రీదేవీ నవరాత్రులు ప్రారంభించి అప్పుడే అయిదోరోజు. కాలము ఆగేది కాదు. అది అన్నిటికంటె గొప్పది, విలువైనది. ఎన్నెన్నో సాధించాలని, ఎంతో ధనము, కీర్తి గడించాలని అనుకుంటాడు మానవుడు. సంఘంలో తన prestige ని maintain చెయ్యాలనుకుంటాడు. కాని కాలాన్నే maintain చెయ్యలేడు. భగవంతుడు మనకిచ్చిన కాలమే తక్కువ. జీవిత పరిమితి సుమారు 8 లక్షల గంటలు. అందులో సగం నిద్రలోనే పోతుంది. మిగిలిన సగమూ పగలు. జాగ్రదవస్థలో ఏవో నిత్యకర్మలు ఎన్నో చేస్తాము. ఎన్నో పాపకర్మలు, పుణ్యకర్మలూ కూడా చేస్తాము. మరి యీ కాలాన్ని దేనికి జమ కడుతున్నాము? భగవన్నామ స్మరణలోను, భగవచ్చింతనలోను గడిపిన కాలమే నిత్య కాలంలో జమ అవుతుంది. మిగిలిన కాలమంతా వ్యర్థమే. అంతేకాదు అది యింకా ఎన్నో జన్మలకు బీజాలను మూటకట్టి అందిస్తుంది.

మహాత్ములు ఈ విషయాలన్నీ క్షుణ్ణంగా ఆలోచించారు. జీవితం నీటి బుడగ వంటిదని తెలుసుకున్నారు. దాన్ని సూచించే చిహ్నంగానే బుద్ధ భగవానుడు మానవునికి జనన మరణ రహిత స్థితిని, శాశ్వత శాంతిని, ఆనందాన్ని అందించడమెలాగో తెలుసుకోవాలని పట్టుదలతో విచారణ చేసి సాధించాడు. పట్టుదల అంటేనే వైరాగ్యము. తీవ్ర వైరాగ్యమే బుద్ధుని విజయానికి కారణమైంది. తాను తప్పక సత్యాన్ని కనుగొనగలననే విశ్వాసమే అతనిని ముందుకు నిడిపింది. గాఢ విశ్వాసమే భక్తి.

మానవుడు తన సాధనలో విజయాన్ని సాధించటానికి, గమ్యాన్ని చేరటానికి భక్తి, వైరాగ్యములు రెండూ ఎంతో ముఖ్యము. చెట్టు చిటారు కొమ్మకు ఉన్న పండును అందుకోవాలంటే పక్షికి రెండు రెక్కలూ బలంగా ఉంటేనే, ఎగిరి అందుకోగలదు. అలాగే భక్తి వైరాగ్యములనే రెండు రెక్కలూ బలంగా ఉంటేనే నరపక్షి(మానవుడు) సంసార వృక్షానికి చివర ఉన్న మోక్ష ఫలాన్ని అందుకోగలుగుతాడు.

-సశేషం

# మాతాజీ అభిభాషణ

(గతసంచిక తరువాయి)

-జపమాల ప్రసాద

అటువంటి మహోన్నతమైన భగవన్నామమునందు మనకెంత మక్కువ కలగాలి! భగవన్నామం అంటే సాక్షాత్ భగవద్రూపమే కదా! దీపానికీ దీపపు కాంతికీ, వాక్కుకీ దాని అర్థానికి ఎలా తేడా లేదో, భగవన్నామానికీ భగవంతుడికీ కూడా అలాగే భేదం లేదు. మనకి ఎంత పెద్ద కడుపు నొప్పి వచ్చినా చిన్న మాత్రనిచ్చి తగ్గిస్తారు డాక్టర్లు. లేదా చిన్న సూదిమందు (ఇంజక్షను) ఇస్తారు. జబ్బు పెద్దది అని పెద్ద ఇంజక్షను ఇవ్వరుగా! అలాగే భవరోగమనే మహమ్మారి మనని బాధపెడుతోంది. దానికి సూక్ష్మాతి సూక్ష్మమైన మోతాదులో భగవన్నామం అనే భలే మందుని ప్రసాదించారు భవరోగ మహావైద్యులైన సద్గురునాధులు. అది ఎక్కువ అవుతుందేమోనని మనం భయపడనవసరం లేదు. అది ఎంత తిన్నా చెడు చేయదు. మనకంత మహోపకారం చేస్తున్న దివ్య ఔషధాన్ని ఎందుకు ప్రేమించటం లేదు మానవులు?



మనకి ఎన్ని బాధలున్నా, హాయిగా నిద్రపట్టేసరికి, ఆ బాధలన్నీ మరచిపోతున్నాము. ప్రొద్దుట లేచేసరికి హాయిగా తేలికగా అనిపిస్తుంది. ఎందువలన? ప్రపంచ విషయాలన్నింటిని మరపింప చేస్తోంది నిద్ర. నిద్రలో మనసు అణిగి ఉంటుంది కనుక, మన బాధలేవీ గుర్తుకు రావటం లేదు. ఇటువంటి సుషుప్త్యానందాన్ని (గాఢ నిద్రలో కలిగే ఆనందం) పొందింప చేస్తుంది భగవన్నామం. "భగవాన్ కా నామ్ బహుత్ మీఠా హై, వహ్ పీతే పీతే అప్‌నే ఆప్‌కో భూల్ జానా" అనేవారు గురుమహరాజ్. భగవన్నామం చాలా మధురమైనది. అది త్రాగి, త్రాగి మిమ్మల్ని మీరే మరచిపోవాలి. ప్రహ్లాదుడు, ధృవుడు, మన మారుతి ఇత్యాదిభక్తులు అటువంటి స్థితిని పొందారు. వారు నడచిన మార్గంలో మనమూ వెళితే, వారు పొందిన ఆనందాన్ని మనమూ పొందుతాం. ఎవరెవరో ఏరుకొని వదిలేసిన వంకాయలు, బెండకాయలు తిరిగి ఏరుకుంటారు. ఎందరెందరో అనుభవించి వదిలేసిన విషయాలని

అనుభవించడానికి వెనుకాడరు మానవులు. కానీ మహాత్ములు, మహాభక్తులు, వారు అనుభవించిన దివ్యానందాన్నీ, అనుభూతినీ మనకోసమని (అనుభవించండిరా అని) ఒలకబోసి వెళ్ళినా, దానిని కాలదన్నుతున్నారు నేటి ఆధునిక మానవులు!

కాలమనే మార్గాన, కోరికలనే గుర్రాలనెక్కి, ఎక్కడికో వెళ్ళాలి, ఏమేమో చేయాలి అంటూ పరుగులు పెడుతున్నారు. ఆరాటపడుతూ ఆ'రాట', ఆ యముని 'రాట' పడిపోతున్నారు. ఆ పరుగుల మధ్య ఒక్కక్షణం ఆగి "ఇంత వరకూ గడిచిన జీవితంలో ఏమైనా నిత్యకాలంలోకి జమ చేసుకున్నానా?" అని ఎవరిని వారు ప్రశ్నించుకోవాలి.

"దేవుడు నావాడు. నాలోనే ఉన్నాడు. పరిపూర్ణ ఆనందం నా సొత్తు. అది నేను పొందాను" అని ఎవరైనా చెప్పారా? చెప్పగలరా? దొరికిన దానితో తృప్తిపడే వాళ్ళనే మహాత్ములన్నారు. వారు కష్టాన్ని కూడా ఇష్టంగానే చూస్తారు. 'నేను ఆనందాన్ని పొందాను' అని కూడా వారు అనరు. ఆనందమే వారి స్వరూపం.

మీరాబాయి చిన్నప్పుడు పెళ్ళి ఊరేగింపు చూసి "అమ్మా! అమ్మా! నాకు కూడా భర్త కావాలి, నా భర్త ఎవరమ్మా?" అని ఏడిస్తే ఆమె తల్లి ఒక కృష్ణుడి విగ్రహాన్ని మీరా చేతిలో పెట్టి, 'ఈయనే నీ భర్త అమ్మా!' అందిట. ఆనాటి నుండి మీరా, 'కృష్ణా కృష్ణా గోపాలా! జనార్దనా' అని స్మరిస్తూ, ఆయన తోటే ఇంద్రియాతీతమైన ఆనందాన్ని పొందింది. మీరాబాయి చేసినట్టుగా మనందరం కూడా నామసంకీర్తన చేసుకుంటే మనతోనే, మనలోనే ఉంటాడు దేవుడు. ఆయన మన స్వంత ఆస్తి. ఆయన ఎక్కడో గుడిలో లేడు. 'అంతా రామమయం' అన్నప్పుడు, మనలో రాముడు లేడా? అబ్బే! అంతా ఉన్నాడు నాలో తప్ప అంటారు చాలామంది. అది తప్పు. అంతటా ఉన్నవాడు నీలోనూ ఉంటాడు. అది గుర్తించాలంటే ముందుగా మనసు మారాలి. మనం అంతటా మంచినే చూస్తే, మనకంతా మంచిగానే జరుగుతుంది. పచ్చ కళ్ళద్దాలు పెట్టుకున్న వాడికి అంతా పచ్చరంగు గానే కనిపించినట్టు, పరమాత్మ అనే కళ్ళద్దాలు ధరిస్తే మనకి అంతా పరమాత్మగానే గోచరిస్తుంది. మనసులో మార్పు తెచ్చేది భగవన్నామస్మరణ. అది మనస్సులోని కలుషాన్ని హరించి, శుద్ధంగా మార్చివేస్తుంది. శుద్ధమనస్సులో భగవద్రూపం గోచరమవుతుంది. మన అంతరంగంలో ఉన్న ఆత్మారాముడే ఇన్ని అనంత రూపాలుగా వెలుగుతున్నాడని గుర్తించగలుగుతాము.

ఎన్ని విధాలుగా చెప్పుకున్నా, ఉన్నది ఒక్కటే అనంతశక్తి. అన్నిరూపాలు, అన్ని నామాలు ఆ శక్తివే. ఏకం సత్ - విప్రా: బహుధా వదంతి. అందుకనేనేమో శివుడి గుడిలో రామనామం ప్రతిధ్వనిస్తోంది.

"యధాంతరం న పశ్యామి। తధా మే స్వస్తిరాయుషీ"

- శివ కేశవులకి భేదం లేదని తెలుసుకున్న వారికి పూర్ణాయుష్షు కలుగుతుందని చెప్తోంది స్కందోపనిషత్తు, ఈ దేహానికి షడూర్మిలు ఉన్నాయి. పుట్టిన వాళ్ళందరూ వెళ్ళిపోవలసిందే అనీ తెలుసు. ప్రసూతి వైరాగ్యం, పురాణ వైరాగ్యం, శ్మశాన వైరాగ్యం అందరికీ వస్తూఉంటాయి. కానీ అవన్నీ తాత్కాలికమే. దేహాభిమానమనే వాసన ఫారిన్ సబ్బులతోను, కుంకుడు కాయలతోనూ వదలదు. అది కేవలం భగవన్నామంతోనే వదులుతుంది. ఆ భగవన్నామ మనేది మనకి సత్యగురువుల వద్ద లభిస్తుంది. గురుదేవుడు మనలో లక్ష్యార్థమనే విత్తనం నాటి, బ్రహ్మ అయ్యారు. నామం ఇచ్చి ఆయన వెళ్ళిపోవడం లేదు. అసలైన గురువు, మనని అహర్నిశలు చూస్తూనే ఉంటారు. "ఏమమ్మా! సాధన ఎలా చేస్తున్నావు? ఇంకా మమకారమనే తీపి పోలేదే" అని చిలుకులు వేస్తూ అనుక్షణం మన యోగం యొక్క క్షేమం చూసే సాక్షాత్తు విష్ణు స్వరూపుడు గురుదేవుడు. కామక్రోధాదులు, అహంకార మమకారాలు, రాగద్వేషాలు, సుఖదుఃఖాలు అనే కలుపు మొక్కలని తీసేసుకో మంటారాయన. తల్లికి ఎప్పుడూ బిడ్డ వయసు తెలియదుట. అదేవిధంగా గురుదేవుడు కూడా తమ బిడ్డలెంత పెద్దవారయినా, నోట్లో గోరుముద్దలు పెట్టి తినిపిస్తారు. భద్రంగా ఇనప్పెట్టెలో దాచుకునే కాగితాలు పత్రాలు ఇవ్వరు వారు. సమర్థులైన గురుదేవులు మనసుమీదనే ముద్రవేస్తారు. ఇంకా ఏమూలలోనైనా గుణాలు గాని, దేహం నేను అనే భావన గాని ఉంటే దానిని కూడా లయం చేసుకునే లయకారుడైన శివస్వరూపుడు కూడా గురువే. అటువంటి శిక్షణనిచ్చి తనబిడ్డలకి స్వస్వరూప జ్ఞానాన్ని ప్రసాదించే పరబ్రహ్మమే తానయినవారు గురుదేవులు.

గురులక్ష్యార్థాన్ని పొంది, గురుసాన్నిధ్యంలోనే ఉన్నాకూడా గుణాలు, వాసనలు వెన్నంటి ఉంటూనే ఉంటాయి. మనకి కోపం వచ్చినట్టుకూడా తెలియదు. ఏదో ఒక బలహీనత కనిపెట్టి అది బయటకి వస్తుంది. నిజమైన సాధకుడికి కోపమనేది మనసులో కూడా రాకూడదు. -సశేషం

నవంబరు సంచికలోని 'ఎందుకు భయం? 'ఇచ్చాను అభయం' రచయిత్రి పేరు కొండ శేషులమ్మగారు అని గమనించ ప్రార్థన

# సన్నిధిలో సంభాషణ

(గతసంచిక తరువాయి) - పరాశర ప్రసాద్

అనంతం 'ఎవరు ఏ విధంగా అనుకున్నా నా భావన మాత్రం మారదు. నేను అక్రూరుడు ఎలా భావించాడో అలానే భావిస్తాను' అన్నారు. శ్రీబాబు మాట్లాడుతూ 'శ్రీకృష్ణుడు సమస్త జగత్తును మురిపించేవాడు. అంతేకాక సమస్త జగత్తును మోహింపజేసే ముద్దుమోము గలవాడు. చిరునగవు చిందులాడుతూ ఉండేది. మాయను హరించి దివ్యత్వాన్ని ప్రసాదించేవాడు. ఆయన క్రీగంటి చూపుతోనే.......... క్రీగంటి చూపుతోనే....... అంటూ......... రెట్టించేసరికి కీర్, కీర్ అనిపించేవాడని అని అనంతం సమాధానం చెప్పాడు.

శ్రీబాబు మాట్లాడుతూ 'కృష్ణపరమాత్ముడు తన క్రీగంటి చూపులోని కాంతిని మనం అందుకోవటానికి మనలో అహంకార, మమకార పొరలు అడ్డువస్తాయి. ఆయన చూపుతోనే ఆ పొరలు తొలగిపోయి శాంతిని, ఆనందాన్ని పొందగలుగుతావు. కాని నీ దృష్టి ఆయన క్రీగంటి చూపుపై నిలవాలి కదా! అట్టి శ్రీ కృష్ణపరమాత్ముని దుర్యోధన వర్గంవారు అర్థం చేసుకున్నారా? అందుచేతనే ఆలోచించి నిర్ణయం తీసికోమని నిన్ను హెచ్చరించాను. శ్రీబాబు ఇంకా మాట్లాడుతూ "పిచ్చివాడా! నీ థీసిస్‌ని నీవు వ్రాయ గలిగావా? పోనీ దానికి పీఠికని నీ గురువుగారైన రావుగారు వ్రాయగలిగారా? మీ ఇద్దరికి వ్రాయటానికి కావలసిన శక్తిని ఇచ్చింది ఎవరు? అది తెలుసుకో" అన్నారు. ఇంతలో అమ్మా! చందూ అని పిలిచి "ఈ పండితులకి మహావాక్యాల గురించి చెప్పమ్మా" అన్నారు.

**ప్రజ్ఞానం బ్రహ్మ, అహం బ్రహ్మాస్మి, తత్త్వమసి, అయమాత్మా బ్రహ్మ** అన్న మహావాక్యాల గురించి చంద్ర వివరించారు. అంతేకాకుండా **సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ , ఏకమేవ అద్వితీయం బ్రహ్మ, సర్వంఖల్విదం బ్రహ్మ** అనే లక్షణల వాక్యాలను గురించి కూడా వివరించారు.

'వేదాలు ఎన్ని అనంత పద్మనాభ శాస్త్రి?' అని శ్రీబాబు ప్రశ్నించారు. నాలుగు అని ఆయన సమాధానం ఇచ్చారు. 'అవి చదవటానికి ఎంతకాలం పడుతుంది తారకం?' అని ప్రశ్నించారు. 'ఒక వేదాన్ని సస్వరంగా, పూర్తిగా పఠించగల శక్తిని సంపాదించటానికి 18సంవత్సరాలు పడుతుంది బాబు' అని తారకంగారు చెప్పారు. 'మరి వాటి అర్థాన్ని తెలిసికోవటానికి ఇంకా

ఎక్కువ కాలం పడుతుందేమో అంటే నాలుగు వేదాలు పూర్తిగా అర్థం చేసికోవాలి అంటే చాలా కాలం పడుతుంది కదా! మరి మన జీవితకాలం అంతా వీటిని చదివి అర్థం చేసుకోవటానికి వినియోగిస్తే ఇంక మనం సాధించ గలిగినది ఏమిటి? వేదం చదివే వారికందరికి దాని అర్థం తెలుసా? అని ప్రశ్నించి తెలియదు కదా. మరి అటువంటి అర్థంలేని చదువును ఏమంటారు తారకం? అని ప్రశ్నించారు. వ్యర్థం అని తారకంగారు సమాధానం చెప్పారు.

'వేదం చదవని వాడు ఎలా పండితుడు అవుతాడు? నిజమైన పండితులు అంటే ఎవరు? భగవద్గీతలో స్పష్టంగా జ్ఞానయోగంలో వివరించ బడినది కదా! మరి నీవు అటువంటి పండితుడవేనా?' అని అనంతంగారిని ప్రశ్నించారు. ఆయన సమాధానం చెబుతూ 'మనల్ని ప్రకాశింపజేసే సత్తా' అన్నారు. అంటే నీ దేహానికి సత్తా లేదన్నమాట. నిన్ను ఒక తన్ను తంతే ఏమౌతావు? నే దేహానికి బాధ ఉండకూడదు కదా. మరి నీవు బాధ పడటమెందుకు? అది కేవలం శాస్త్ర జ్ఞానం. అందువల్లనే మహాత్ములు వేదాల సారాన్ని మహావాక్యాల రూపంలో వివరించారు. అట్టి మహావాక్యాలను గురుదేవుని ద్వారా అనుభవంలోకి తెచ్చుకోవాలి. గురుదేవుడు ఇచ్చిన లక్ష్యార్థాన్ని సాధించిన కొలది నీలో నానాత్వం నశించి సర్వేసర్వత్రా పరమాత్మని దర్శిస్తావు. అప్పుడు మహావాక్యాలను అనుభవపూర్వకంగా తెలుసుకో గలుగుతావు' అని బోధ చేస్తూ 'ఇప్పుడు అనంతపద్మనాభశాస్త్రి వ్రాసిన గ్రంథంగాని, ఆ గ్రంథానికి సంబంధించిన పీఠికనుగాని వ్రాసిన సత్తా ఎవరిది? అదే **ప్రజ్ఞానం బ్రహ్మ**' అన్నారు శ్రీబాబు. 'అనంతం గురుదేవుణ్ణి ప్రార్థించి ఆయన యందు విశ్వాసం పెంపొందించుకొని గ్రంథాన్ని వ్రాయటం మొదలు పెట్టాడు కాబట్టి ఆయన కరుణని పొందగలిగాడు' అని శ్రీబాబు అన్నారు.

**3-3-1985**

ఈ రోజు రాత్రి వాకింగ్ జరిగిన తరువాత భక్తులకు శ్రీబాబు దర్శనమిచ్చారు. డా॥ ప్రసాదరావుగారు శ్రీబాబుని ప్రశ్నిస్తూ 'మానవుడు యౌవనంలో తన కాలాన్నంతా సాధనకి ఉపయోగిస్తే బాగుంటుందేమో?' అని అన్నారు.

శ్రీబాబు మాట్లాడుతూ 'ఆగండి! మీరు చెప్పింది తప్పు. మీ ఎదురుగా కూర్చున్న పెద్దమనిషి యౌవనంలో ఉండగా ఆయన భార్యతో ఏమని సంభాషించాడో కనుక్కోండి.

-సశేషం

## శ్రీకాళీగార్డెన్స్‌లో విశేషపూజా కార్యక్రమములు

**డిశంబరు 2009**

2 బుధ పూర్ణిమ, శ్రీ సద్గురు పాదపూజ,

3 గురు శ్రీ సద్గురుదేవులు స్వస్వరూపస్థితి పొందిన తేది - శ్రీ సద్గురు పాద పూజ, భక్త సమారాధన.

11 శుక్ర శ్రీ గురుదశమి, సత్సంగం, శ్రీ సద్గురు పాదపూజ.

14 సోమ మాసశివరాత్రి.

**16 బుధ నుండి ధనుర్మాస కార్యక్రమాలు** - ఉదయం 9.30 గం.లకు సంకీర్తన, 10 గం. లకు తిరుప్పావై, 10.30 గం.లకు ఋషుల చరిత్ర, 11 గం.లకు శ్రీమదాంధ్ర మహాభాగవత ప్రవచనము, ప్రార్థన, తీర్థ ప్రసాదములు.

25 శుక్ర క్రిస్టమస్ - శ్రీసద్గురు పాదపూజ, సత్సంగం.

28 సోమ ముక్కోటి ఏకాదశి, ఉత్తర ద్వార దర్శనము, శ్రీ సద్గురు పాదపూజ, ఏకాహము, భక్త సమారాధన.

**జనవరి 2010**

1 శుక్ర ఆంగ్ల సంవత్సరాది, శ్రీ సద్గురు పాదపూజ, భక్త సమారాధన.

9 శని శ్రీ గురుదశమి, సత్సంగం, శ్రీ సద్గురు పాదపూజ.

13 బుధ మాస శివరాత్రి, భోగి, శ్రీ సద్గురు పాదపూజ, సత్సంగం, భక్త సమారాధన, రాత్రి 8 గం.లకు శ్రీ సద్గురుదేవులకు భోగి పళ్ళు పోయుట

14 గురు మకర సంక్రాంతి,శ్రీ సద్గురు పాదపూజ, భక్త సమారాధన.

15 శుక్ర కనుమ, శ్రీ సద్గురు పాదపూజ, భక్త సమారాధన.

22 శుక్ర రథ సప్తమి

26 మంగళ భీష్మ ఏకాదశి, శ్రీ సద్గురు పాదపూజ. సత్సంగం, పెద నింద్రకొలను బ్రాంచిలో శ్రీ గురుదేవుల దివ్య మంగళమూర్తి ప్రతిష్ఠా షష్ఠమ వార్షికోత్సవము, శ్రీ సద్గురు పాదపూజ, సత్సంగం, భక్త సమారాధన

30 శని మాఘ పూర్ణిమ,శ్రీ సద్గురు పాదపూజ, సత్సంగం, భక్త సమారాధన.

# సత్సంగ సౌరభం

(గతసంచిక తరువాయి) -శివ ప్రసాద్

(శ్రీ వీరాంజనేయ స్వామి మరియు శ్రీ నీలకంఠేశ్వర స్వామి వారి ఆలయం (కె.పి.హెచ్.బి.కాలని) హైదరాబాదులో ది. 10-8-2009న డా॥ రామతారక పరబ్రహ్మ ప్రసాద్ చేసిన ప్రసంగానికి సంగ్రహ రూపం)

ప్రపంచంలో ఉన్న వస్తువులన్నిటినీ శరీరంతో సహా నావి అంటున్నాము. నా మనస్సు, నా బుద్ధి అంటున్నాము. అంటే నేను వేరు. ఇవన్నీ నావిగా ఉన్నై. 'నేను' వీటికి అతీతంగా ఉన్నది. నా ఇంటికి వెళ్తున్నాను అంటూ, తన దగ్గరకు కాక, వేరే చోటికి వెళ్తున్నాము. తాను అనేది ఏది అంటే శరీరాన్ని చూపిస్తున్నాము. కాని 'తాను' శరీరం కాదు. మొన్న మాతాజీ చెప్పినట్లు 'నేను' శరీరం కాదు. ఎందుకంటే చనిపోయినప్పుడు శరీరం అక్కడే పడి కనపడుతూ ఉన్నా, వాడు పోయాడు అంటున్నాము.

ఈ శరీరానికి కొన్ని అలవరచుకొన్నాము, శరీరము, ఇంద్రియములు, మనస్సు. వీటి మూడిటికి త్రికరణములు అని పేరు. ఆ త్రికరణములు బుద్ధిగా ఉంటే తప్ప ఆత్మజ్ఞానం కలగదు. శరీరం, ఇంద్రియాలు, మనస్సు మూడిటితో శరీరం కర్మ చేస్తుంది. మనస్సుకు విషయాల సారాన్ని అందించేవి ఇంద్రియాలు. వాటి సారాన్ని గ్రహించేది మనస్సు. మనస్సు యొక్క సంకల్పము కర్మలకు కారణం. శరీరము, ఇంద్రియాలు బాగానే ఉంటై. కాని మనస్సు బాగా లేదు అంటాము. మనస్సులో సుఖము, శాంతి ఉండవు. మనస్సుకు శాంతి ఎలా అంటే, దానిని శాంతిగా ఉంటమే మార్గం. నిశ్శబ్దం కావాలంటే ధ్వనులు చేయకూడదు.

మనకు శాంతి ఎప్పుడు కలుగుతుంది? నిద్రపోయినప్పుడు హాయిగా ఉంటుంది. ఎందువలన ఈ హాయి వస్తోంది? అన్నీ వదలి పెట్టినందువలన ఈ హాయి కలుగుతున్నది. అందులో ఏ మాత్రం తేడా వచ్చినా ఆ హాయి ఉండదు. శరీరము, ఇంద్రియములు పనిచేసినా ఉండదు. కల వచ్చినా ఉండదు. ఒక్క గాఢ నిద్రలో ఉంటుంది. అది అక్కరలేదు అనేవాడు ఉండడు. మందులు వేసికొని అయినా సరే నిద్రపోతారు.

అయితే ఈ స్థితిలో మనం ఎప్పుడూ ఉండాలి. అంటే అలా ఎప్పుడూ నిద్రపోతూ ఉండటం అని అర్థం కాదు. ఎప్పుడూ నిద్ర అంటే చావే. శవంతో

సమానం. నిద్ర పోయిన వాడు మళ్ళీ లేస్తాడు. అందుకే రోజూ చచ్చేవాడికి ఏడ్చేవాడెవరు అని సామెత. నిద్రపోయినవాడు రోజూ చచ్చినట్లు ఉంటాడు. రాత్రంతా అలా ఉండటం చేత, ఇంద్రియాలకు, శరీరానికి పనిచేయటానికి శక్తి వస్తుంది. అందరికీ మనశ్శాంతి కావాలి. కాని దానికి మార్గం తెలియదు.

దానికి సద్గురు దేవులను ఆశ్రయించాలి. ఎందుకంటె, దానిని ఎలా శాంతంగా ఉంచుకోవాలో మనం నేర్చుకోలేదు. నీ శరీరం నీవు చెప్పినట్లు వింటేనే నీ పని చేయగలుగుతుంది. అలాగే నీ మనస్సు నీవు చెప్పినట్లు వింటేనే నీవు శాంతిని పొందుతావు. నీవు నీ మనస్సు చెప్పినట్లు వింటే, అది ఎటు తీసికొని పోతుందో తెలియదు. అలా మనస్సును వశం చేసుకున్నవాడు ఆంజనేయుడు. మనం ఆయనను ధ్యానం చేయాలి. నీవు ఏది నేర్చుకుంటే అదే నీకు వస్తుంది. ధ్యానం చేసిన తరువాత హనుమంతుడికి ఆ శక్తి ఎలా వచ్చింది అని విచారణ చెయ్యాలి. ఆయన సూర్యుడి వద్దనుంచి ఆ శక్తిని పొందాడు. కనుక ఆ సూర్యుడి యొక్క శక్తిని ధ్యానం చెయ్యాలి. ఇంతకు ముందు సువర్చలా అని చెప్పుకున్నాము. అదే సూర్య శక్తి. దానిని ఆంజనేయుడు గ్రహించాడు. ఆయనను ధ్యానిస్తే ఆయన ఆ శక్తిని మనకు ఇస్తాడు. ఆయన సూర్యుని వద్ద శాస్త్రాలన్నీ నేర్చుకున్నాడు. అయినా ఆనందం కలగలేదు. దానికై బ్రహ్మ విద్యను నేర్చుకోవటానికి రాముని వద్దకు చేరాడు. అంతకు ముందు తాను నేర్చిన శాస్త్రాలన్నీ వదిలేసి ఆత్మ విద్యను పొందాడు. అందరిలో ఉన్న ఆత్మ ఒక్కటే, అందరి ఇళ్ళలో ఉన్న కరెంటులాగ. నీ మనస్సు వేరుగా పెట్టుకోవటం వలన నీ కర్మ నీవు అనుభవిస్తున్నావేమోగాని, అంతా ఒక్కటే కరెంటు.

భూమి మీద అయితే ఇంతవరకు నాది అంటున్నావు. కాని పంచ భూతములలో ఏదీ నీది కాదు. అది భగవంతుడిది. నీవు కేవలం కస్టోడియన్ (custodian) అంటే ధర్మకర్తవు మాత్రమే. ధర్మంగా ఉండాలి. ఆచరణలో ధర్మం ఉండాలి. సత్యంవద, ధర్మంచర. ఏది ధర్మం? ఏది ఇతరులు నీకు చేస్తే నీకు బాధ కలుగుతుందో, అది నీవు ఇతరులకు చెయ్యకుండా ఉండటం. వ్యాసుడు ఎన్నో గ్రంథాలు వ్రాసి, వాటిలోని శ్లోకాల సారం అంతా అర్ధ శ్లోకంలో చెబుతాను అని, పరోపకార పుణ్యాయ పాపాయ పరపీడనం అని చెప్పాడు. ఇతరులను పీడిస్తే అది పాపం. ఇతరులకు మేలు చేస్తే అది పుణ్యం. అందు వలన ఇతరులకు మేలు చేయాలి.

-సశేషం

# సంత్ నామదేవ్ చరితామృతం

(గతసంచిక తరువాయి) -మనోజ్ కుమార్

**గోసా -** విఠల్ భక్తుడివా?

**నామ -** ఔను.

**గోసా -** ఎక్కడికి వెళ్ళాలి?

**నామ -** తెలియదు.

**గోసా -** అయితే తప్పకుండా నీవు గురు అన్వేషణలో ఉన్నావు. (ఆశ్చర్యపోయి తనవైపే చూస్తున్న నామదేవుడితో) నీ యాత్ర దాదాపు ముగిసినట్లే. గురుదేవుడి ఇంటి దరిదాపులకు వచ్చావు. ఆ గురుదేవుడు పండు ముదుసలి. కుష్ఠరోగి. రాత్రింబవళ్ళూ గుళ్ళోనే పడి ఉంటాడు.

**నామ -** (ఆత్రంగా) ఆ గురుదేవుడు ఎవరు? ఎక్కడ ఉంటాడు? ఆ గుడి ఎక్కడ ఉంది?

**గోసా -** ఆ గుడి సంగతి నాకు తెలియదు. నువ్వే వెతుక్కో. గురుదర్శనం అంటే అంత సులభం అనుకున్నావా? వెళ్ళు, వెళ్ళి అన్వేషించు.

నామా ఆ గోసావి ఎవరో కాదు, మాయావి అయిన తన విఠలుడే అని గుర్తించాడు.

అంబేజోగాయిలో మూడు రోజులు ఉండి యోగీశ్వరి గుళ్ళో నమస్కరించి నామదేవుడు పరళివైజనాథ్ వైపు బయలుదేరాడు. ఆ రోజు అతడికి అన్నీ శుభ శకునాలే. పరళిలో ప్రవేశిస్తుంటే ఒక గుడిసెలోనుండి ఆరతిపాట వినిపించింది. పరిచితమైన కంఠస్వరమే. పాట చివర 'జగన్మిత్ర వినిపిస్తున్నాడు' అని వినగానె నామదేవుడు అత్యంత ప్రేమపూరిత స్వరంతో జగన్మిత్రా ! అని పిలిచాడు. జగన్మిత్ర, నామదేవుడు పరస్పరం ఆలింగనం చేసుకున్నారు. నామదేవుడి వృత్తాంతము విని జగన్మిత్ర జ్ఞానదేవులు 'ఖేచర' అని బిరుదు ఇచ్చిన విసోబాగారు ఇక్కడికి దగ్గరలో ఉన్న ఔంఢ్యానాగనాథ్‌లో ఉంటారు అని, ఆయనను కలిస్తే నామదేవుడి సమస్యకు పరిష్కారం లభించవచ్చు అని చెప్పాడు. ఇద్దరూ ఔంఢ్యా నాగనాథ్ చేరుకుని విసోబాను గురించి అన్ని చోట్ల వెతికారు. ఎందరినో అడిగారు. ఎవ్వరూ విసోబాను గురించి చెప్పలేక పోయారు. హతాశుడైన నామదేవుడు జగన్మిత్ర గురుదేవులైన నాగేశ స్వామివారి పాదాలపై వ్రాలి, ఇక విసోబాగారు కనిపించక పోతె ఇక్కడే శివ

లింగానికి తలబాదుకుని చావనైనా చస్తానుగాని, గురుదర్శనం కానిదే తిరిగి పంఢరి వెళ్ళనుగాక వెళ్ళను అని తన ఆవేదనను అంతా వెలిబుచ్చాడు. నాగేశ స్వామి మధురంగా చిరునవ్వు నవ్వుతూ "దేవుడికి నీ ప్రాణాలు అవసరం లేదు. గురుదేవుడు కోరేది నీ మనస్సును. అత్యంత వినయభావంతో గుళ్ళోకి వెళ్ళు. విసోబా ఎక్కడికి వెళ్ళినా సరే రాత్రికి శివదర్శనం కోసం రోజూ గుడికి తూ.చ తప్పక వస్తారు. బహుశ ఆ మహాత్ముడు నిన్ను ఒంటరిగా కలుసుకోవాలనుకుంటున్నారేమో! మా జగన్మిత్రను ఇక్కడే వదలి నీవొక్కడవే గుళ్ళోకి వెళ్ళు. ఇష్టఫల ప్రాప్తిరస్తు" అని దీవించారు.

నాగనాథ్ మందిరంలో నామ అఖండ దీపం దగ్గర కూర్చుని విసోబా దర్శనం కోసం చూస్తున్నాడు. సంధ్య క్రమంగా రాత్రిగా మారింది. విసోబా వచ్చేదాక కదలకూడదు అని నామదేవుడు కళ్ళల్లో వత్తులు వేసుకుని ముఖద్వారం వైపే పరీక్షగా చూస్తూ ఉన్నాడు. మనస్సులో ముక్తాయి మాటలు గుర్తుకు వచ్చి ములుకుల్లా గుచ్చుకుంటుంటే అలా నిరీక్షణలో ఎంతసేపు గడిచిందో తెలియదు. ఎవరో ఒక వృద్ధుడు కుంటుకుంటూ గుళ్ళోకి వచ్చాడు. కాళ్ళకు, చేతులకు గుడ్డలు చుట్టి ఉన్నాయి. అతడు నామదేవుడి వైపు తదేకంగా చూశాడు. ముక్తాయి అన్న మాటలు మనస్సులో మెదులుతుంటే, వాటినే తలచుకుంటూ ఆ ఆలోచనలో పడిపోయిన నామదేవుడికి ఈ జరుగుతున్నది ఏదీ తెలియలేదు.

రాత్రి బాగా ప్రొద్దుపోయింది. నామా ఆలోచనలు ఎంతకూ తెగటం లేదు. ఎక్కడో ఎవరో మూల్గుతున్నట్లు వినిపించి ఆలోచనలలో నుంచి బయట పడ్డాడు. ఇప్పుడు మూలుగు స్పష్టంగా వినిపిస్తున్నది. మొదట నాకెందుకు? అనుకున్నాడు. కాని ఆ మూలుగు ఘోరంగా, కర్ణకఠోరంగా ఉంది,. ఇక ఆగలేక అది వినవచ్చే వైపుకు వెళ్ళాడు. అది శివుడి గర్భగుడిలో నుంచి వస్తున్నది. అక్కడి దృశ్యం చూసిన నామదేవుడు అవాక్కైనాడు. అతనికి కంపరంతో ఒళ్ళు జలదరించింది. రెండు కాళ్ళూ శివలింగం మీద పడేసి ఒక జీర్ణ వృద్ధుడు కుష్ఠరోగ పీడితుడు, ఒళ్ళంతా పుళ్ళకు కట్టిన గుడ్డలతో, నోట్లోనుండి చొంగ కారుస్తూ, ముక్కులు పగిలే దుర్వాసన గుప్పుమని అంతా వ్యాపిస్తుంటే బాధతో ఘోరంగా మూలుగుతూ పడి ఉన్నాడు. పుళ్ళలోనుండి రసిక, చీము కారుతున్నాయి. నామదేవుడికి అతనిని చూడగానె జాలితో పాటు ఏహ్యాభావం కూడ కలిగింది.

**నామ -** (కటువుగా) బాబా! లేచి ముందు ఆ శివలింగం మీద పెట్టిన మీ కాళ్ళను ప్రక్కన పెట్టండి. ఈ దేవాలయం, దేవుడి మర్యాదను కాపాడండి.

వృద్ధుడి కనురెప్పలు బలవంతాన తెరుచుకున్నాయి. ఒక్కసారి నామదేవుడి వైపు చూసి మళ్ళీ బరువుగా వాలి మూసుకున్నాయి. ఆ వృద్ధుడు తనను కాదన్నట్లు మళ్ళీ పెద్దగా మూలగటం మొదలు పెట్టాడు.

**నామ -** (అసహనంగా) చెప్పేది నీకు కాదూ? నన్ను కాదన్నట్లు అలా పడుకుని మూలుగుతావేంటి? శివలింగం మీద అలా కాళ్ళు పెట్టుకోవటానికి నీకేమీ అనిపించటంలేదా? జ్యోతిర్లింగాలలో అత్యంత శ్రేష్ఠమైన ఈ లింగాన్ని దర్శించటానికి జనం ఎంతెంత దూరాలనుండి యాత్రలు చేసి వస్తారు? ఈ దృశ్యాన్ని చూస్తే వాళ్ళ భక్తి భావం ఏమౌతుంది? ముందు లింగంపైనుండి ఆ కాళ్ళు తీయి.

నామదేవుడి స్వరం తీవ్రంగా ఉంది. ఆ కుష్ఠరోగి ఇంకా పెద్దగా మూలుగుతూ, మూలుగుకు మూలుగుకు మధ్య అతి కష్టంగా ఇలా అన్నాడు.

**వృ -** అయ్యో! అలాగా బాబూ! కళ్ళు కనబడిఛావవు. కాళ్ళు తిమ్మిరెక్కి నొప్పులు సహించలేక కాస్త ఎత్తుగా ఉందని అక్కడ పెట్టాను. కాని అక్కడ ఉన్నది శివలింగం అని తెలియదు. బాబూ! కాళ్ళు రాళ్ళలా బరువుగా ఉన్నాయి. కదిలించలేను. పోనీలే, మంచి సమయానికి వచ్చావు. కాస్త నా కాళ్ళు తీసి శివలింగం లేనిచోట పెట్టి నన్ను ఈ పాపం నుండి తప్పించి పుణ్యం కట్టుకో. నాకు గొప్ప ఉపకారం చేసినవాడవు అవుతావు. నీ శ్రమ వృథాపోదు.

నామదేవుడు ఆ వృద్ధుడివైపు చూశాడు. ఒళ్ళు కంపరంతో జలదరించింది. వీడిని ముట్టుకోవటమా? మనకెందుకులే అనిపించింది. కాని ఎందుకో తెలియదు, మళ్ళీ చూడకుండా ఉండలేక పోతున్నాడు. వీడి కోసం కాకపోయినా, ఆ క్షేత్ర పవిత్రత కాపాడటానికైనా ఆ కాళ్ళు అక్కడనుండి తీసివేయాలి. పైగా వృద్ధుడు, రోగిష్ఠిమారివాడు, అశక్తుడు. అయ్యోపాపం అనిపించింది. దీన దుర్బలుల సేవ చేయాలని తాను ఎన్ని సార్లు అభంగాలలో పాడలేదు. అవన్నీ ఉత్తుత్తి మాటలేనా? అతడి మనస్సు అతణ్ణి వెక్కిరించింది. ముందు అతడిని కాస్త దూరంగా పడుకోబెట్టి తరువాత స్నానం చేసి శుచిగా రావచ్చు అనుకున్నాడు. పాండురంగణ్ణి స్మరించుకుంటూ వృద్ధుడి రెండు పాదములు ఎత్తి ప్రక్కకు పెట్టి వెనక్కు తిరిగాడు. 'నాన్నా! ఇక్కడ కాళ్ళకు ఏదో ఎత్తుగా తగులుతున్నట్లున్నది' వెనకనుంచి వృద్ధుడి హీనస్వరం వినిపించింది. సరే అనుకుంటూ ఆ పాదం ఎత్తి మరోదిక్కువైపు పెట్టాడు.

- సశేషం

# గురుకృప

(గతసంచిక తరువాయి) -శివ ప్రసాద్

కల్మాషపాదుడు ఒకనాడు వసిష్ఠాశ్రమానికి పోతూ అరణ్యములో దారి తప్పాడు. అతడికి వసిష్ఠుడి కుమారుడైన శక్తి కనిపించగా అతనిని చూచి 'ఓరీ దారిలో ఎందుకు నిలబడతావు? తప్పుకో.' అని గద్దించాడు. శక్తి 'ఓరీ నేను ధర్మపథములో ఉన్నవాడిని. నన్నెందుకు తొలగిపొమ్మంటావు అని అడిగాడు. కల్మాషపాదుడికి కోపం వచ్చి శక్తిని కొట్టగా శక్తి ఆ రాజును రాక్షసుడవై నరమాంసము తింటూ ఉండమని శపించాడు. అంతలో చెంతనుండి ఇదంతా గమనిస్తూ ఉన్న విశ్వామిత్రుడు కింకరుడు అనే రాక్షసుడిని పంపి అతడు కల్మాషపాదుడి హృదయాన్ని ఆవహించేలా చేశాడు. ఆ రాక్షసుడు ఆవహించి నప్పుడు కల్మాషపాదుడు రాజకార్యాలు మాని రాక్షసుడి వలె ప్రవర్తించేవాడు. రాక్షసరూపం వచ్చిన మిత్రసహుడు నా ఈ రాక్షస స్వభావానికి నీవే కారకుడవు కనుక మొదట నిన్నే ఆహారంగా స్వీకరిస్తున్నాను అని శక్తిని అతడి సోదరులను మింగివేశాడు. అంతటితో ఆగక శక్తి భార్యను తరుముకుని పోతూ ఉండగా అది చూసిన వసిష్ఠుడు మంత్ర జలం చల్లగా కల్మాషపాదుడికి శాప విమోచనము అయింది.

ఒకనాడు ఒక బ్రాహ్మణుడు చాలా ఆకలితో వచ్చి తనకు మాంస సహితంగా భోజనము పెట్టించమని అడిగాడు. మిత్రసహుడు సరే అని అంతః పురానికి వచ్చి ఆ సంగతి మరచి నిద్రపోయాడు. నిద్ర లేవగానే అతడికి బ్రాహ్మణుడి భోజనము సంగతి గుర్తుకు వచ్చింది. అతడు వంటవాడిని పిలిచి బ్రాహ్మణుడొకడు భోజనార్థి అయి వచ్చి ఉన్నాడు, అతనికి మాంసంతో కూడిన ఆహారం పెట్టు అని చెప్పాడు. వంటవాడు ఇంత ప్రొద్దుపోయి ఇప్పుడు మాసం ఎక్కడ దొరుకుతుంది? అని అడిగాడు. మిత్రసహుడు అయితే నరమాసంతో పెట్టు అన్నాడు. వంటవాడు వధ్యస్థానానికి వెళ్ళి నరమాంసం తెచ్చి వండి ఆ విప్రుడికి భోజనము పెట్టాడు. బ్రాహ్మణుడు భోజనము చేస్తూ, అది నరమాంసం అని తెలుసుకొని ఆ రాజును నీవు నరభక్షకుడగు రాక్షసుడివి కమ్మని శపించి వెళ్ళిపోయాడు. బ్రాహ్మణ శాపం వలన సౌదాస నరేంద్రుడు రాక్షసుడిగా మారి నరమాంసం భక్షణ చేస్తూ ఉన్నాడు.

ఒక రాత్రి మిత్రసహుడు సురత సుఖము అనుభవిస్తున్న ఒక బ్రాహ్మణదంపతులను చూసి ఆ బ్రాహ్మణుని పట్టుకొని భక్షించాడు. ఆ

బ్రాహ్మణి దుఃఖించి కల్మాషపాదుణ్ణి నీవు నీ సతితో సంగమిస్తే మరణించెదవు గాక! అని శపించింది.

ఉదంకుని వలన శాపవిమోచనం పొందిన కల్మాషపాదుడు రాక్ష సత్వమును వదలి మరల రాజై రాజ్యపాలన చేశాడు. కాని అతడు ఆ బ్రాహ్మణ స్త్రీ శాపమును తలచుకొని సతీ సంగమము చేయకుండా ఉన్నాడు. చివరికి వంశాభివృద్ధి కొరకు పరమ పతివ్రత అయిన తన భార్య మదయంతిని తమ గురువు అయిన వసిష్ఠుని ద్వారా పుత్రుని పొందమని నియోగించాడు. ఆమెకు తమ గురువైన వసిష్ఠుని వలన జన్మించిన పుత్రుడే అశ్మకుడు.

ఉదంకుడు భోజనం చేస్తుంటే అన్నంలో ఒక శిరోజం కనిపించింది. అతనికి కోపం వచ్చింది.

**ఉదం -** (కోపంతో ) ఓ రాజా! నీవిట్టి అశోధితమైన ఆహారం పెట్టావు కనుక అంధుడవైపోయెదవుగాక.

**మి.స -** సంయమీంద్రా! మునులకు ఇంత కోపం తగదు. ఇంత చిన్న దోషమునకు అంత పెద్ద శిక్ష విధించటమూ తగదు. అయినా నీవు పాడి తప్పి శపించావు కనుక నీవు అపుత్రకుడవై పోయెదవుగాక. నీ శాపమునకు ఇది నా ప్రతి శాపం.

**ఉదం -** రాజా! నేను అపుత్రకుడనగుట సహించజాలను. దయచేసి నీ శాపాన్ని ఉపసంహరించు.

**మి.స -** ఓ విప్రోత్తమా! నీవెరుగనిది ఏమున్నది -

**నిండుమనంబు నవ్య నవనీత సమానము పల్కుదారుణా**
**ఖండల శస్త్రతుల్యము జగన్నుత విప్రులయందు నిక్కమీ**
**రెండును రాజులందు విపరీతము గావున విప్రుడోపు యో**
**పండతి శాంతడయ్యు నరపాలుడు శాపము గ్రమ్మరింపగన్॥**

నాకు శాపాన్ని ఉపసంహరించుకొనే శక్తిలేదు. నీవు విప్రోత్తముడవు కనుక నన్ను కరుణించి నాకు శాపవిముక్తిని ప్రసాదించు.

**ఉదం -** రాజా! విచారించకు. అనతి కాలంలోనే నీవు శాపవిముక్తుడవు కాగలవు. ఇక నేను వెళ్ళి వస్తాను. గురుపత్ని నా ఆగమనానికై నిరీక్షిస్తుంటుంది.

ఉదంకుడు కుండలములను కృష్ణాజినంలో పదిలంగా మూట కట్టుకుని గౌతమాశ్రమానికి తిరిగి ప్రయాణమైనాడు. దారిలో అతనికి బాగా ఆకలి వేసింది. చుట్టూ చూస్తే కమ్మని సువాసనలీనుతూ బాగా పండిన

ఫలాలతో ఉన్న ఒక బిల్వ వృక్షం కనిపించింది. ఉదంకుడు ఆ మూటను ఒక కొమ్మకు తగిలించి బాగా పండిన కొన్ని ఫలాన్ని కోసుకుని వాటిని భక్షించేముందు ఆచమనం చేయటానికి ప్రక్కనే ఉన్న ఒక కొలనులో దిగాడు. అదే సమయంలో పెద్దగాలి వీచి బిల్వవృక్షశాఖకు తగిలించిన మూట క్రింద పడింది.

మూట క్రింద పడటమే ఆలస్యం, దానికోసమే కాచుకుని ఉన్నట్లుగా ఒక సర్పం ఆ మూటను తీసుకొని వేగంగా పారిపోవటం మొదలు పెట్టింది. ఉదంకుడు దానిని వెంబడించాడు. ఆ సర్పం అక్కడే ఉన్న కలుగులో దూరి మాయమైంది. ఉదంకుడికి చాలా బాధ కలిగింది. అతడు గురుదేవుని స్మరించుకొని అక్కడే ఉన్న సూదివంటి పదునైన మొనగల ఒక కాష్ఠంతో ఆ కలుగును త్రవ్వటం మొదలుపెట్టాడు. గురుదేవుణ్ణి స్మరించుకుంటూ ఉదంకుడు అలా త్రవ్వుతూ ఉంటే భూమి సహించలేక వణికిపోయింది.

గురుకార్యాన్ని నిర్వర్తించటంలో ఉదంకుడికి విఘ్నం కలగటం చూసి ఆ పరమగురుభక్తుడిపైన ఇంద్రుడికి జాలి వేసింది. అతడు ఒక బ్రాహ్మణుడి రూపంలో ఉదంకుడి దగ్గరకు వచ్చి....

**బ్రాహ్మ -** అయ్యా! ఈ కట్టెతో ఎందుకు అంత శ్రమిస్తూ త్రవ్వుతున్నారు?

**ఉదం -** బ్రాహ్మణోత్తమా! నేను మా గురుపత్నికి సమర్పించటానికై తెస్తున్న కుండలములు ఒక సర్పం తీసుకొనివచ్చి ఈ కలుగులో దూరింది. ఆ సర్పము నుండి కుండలములను పరిగ్రహించటానికై త్రవ్వుతున్నాను.

**బ్రాహ్మ -** నీ కుండలములు దొంగిలించిన ఉరగము సామాన్యమైనది కాదు. నీ కుండలములను అపహరించినది తక్షకుడు. అతడు ఇప్పటికే కుండలములతో కూడా పాతాళలోకం చేరినాడు. నీవు ఈ కొయ్యకోలతో ఎంత కాలంపాటు త్రవ్వితే ఇక్కడకు సహస్రయోజనముల దూరంలో ఉన్న పాతాళలోకం వచ్చేను? నీవు ఆ కుండలములను తీసుకొని వెళ్ళి ఎప్పుడు నీ గురుపత్నికి ఇస్తావు? ఇది జరిగే పనేనా?

**ఉదం -** బ్రాహ్మణోత్తమా! తక్షకుడే తస్కరించినా, ఐరావతమే తస్కరించినా లేదా దాని సంతానం అపహరించినా ఆ కుండలాలు పాతాళంలో ఉన్నా, ఆ పాతాళలోకం నుంచైనా సరే నేను ఆ కుండలములు తెచ్చి తీరతాను. ఒకవేళ అది నాకు చేతకాకపోతే గురుకార్యంలో నా ప్రాణాలైనా అర్పిస్తాను గాని నా ప్రయత్నంమాత్రం విడిచిపెట్టను. ఇది మాత్రం ముమ్మాటికి సత్యం.

-సశేషం

# శ్రీకృష్ణ కర్ణామృతం

- సుశీలా ప్రసాద

**8శ్లో॥ మద శిఖణ్డి శిఖణ్డ విభూషణం**
**మదన మన్థర ముగ్ధ ముఖామ్బుజమ్**
**వ్రజవధూ నయనాఞ్చల వఞ్చితం**
**మమవాఙ్మయ జీవితమ్ ॥**

బృందారణ్యంలో ఒక నెమలి ఉంది. బలిష్ఠమైన శరీరము, మరకతమణుల వన్నెలీనే పెద్ద పింఛమూ, తలపైన తురాయి ఉన్న ఆ నెమలి ఆ అడివిలోని నెమళ్ళన్నిటికీ అధిపతి. మేఘాలు చూస్తూ ఉరుముల చప్పుడు వింటూ ఆనందంగా పురివిప్పి ఆడుతుంటే ఆ నెమలిని చూస్తూ సాటి నెమళ్ళు, జంతువులు, పక్షులు అన్నీ వినోదిస్తూ దానిని మెచ్చుకుంటూ ఉంటాయి. తరుచుగా ఆహా! ఓహో! అనేవారి పొగడ్తలను వింటూ క్రమంగా ఆ నెమలికి గర్వం బాగా పెరిగిపోయింది. "ఎన్ని పాములెదురైనా అన్నిటినీ చీల్చి చెండాడగలను. ఆటలో ఏ నెమలినైనా ఇట్టే ఓడించగలను" అనుకుంటూ ఇంత బలమూ బలగమూ రూపమూ కళానైపుణ్యమూ అన్నీ ఉన్నవారు సాటి ఎవరనే అహంకారం మనస్సు నిండా ఆవరించింది. దానిలో ఎదుటివారిలో మంచిని చూడగల బుద్ధి నశించి ఆత్మస్తుతి, పరనింద బాగా అలవాటయిపోయాయి. "అదిగో! ఆ కోయిలను చూడు! ఏ కోశాన్నైనా అందముందీ! నల్లగా వికారంగా ఉన్న రూపం అదీ!" అనో, అష్టవంకరలతో మెలికలు తిరుగుతూ పాకే ఆ పాముల నడక చూస్తే నాకెంత అసహ్యం అనీ" అంటూ ఎప్పుడూ ఎవరినో ఒకరిని వెటకారంచేస్తూనే ఉంటుంది.

ఒకనాడు పావురం ఒకటి ఒక వార్త తెచ్చింది. "అదిగో! ఆ తూర్పు వైపు పోగాపోగా అక్కడ ఒక విచిత్రం చూశాను. ఎన్నడూ నేను చూడని వింత అది. అక్కడొక చెట్టుకింద బహుసుందరమైన మూర్తిని చుట్టుకుని బోలెడు మంది ఉన్నారు. ఎప్పుడూ నువ్వు అందంగా చేసే నృత్యాన్ని చూస్తూ అందరూ ఆనందిస్తున్నారేగాని, నేను చూసిన ఆ మూర్తి చేసే మాయ ఏమిటో తెలియదుగాని అక్కడ ప్రతి ఒక్కరూ మైమరచి పోవటమేకాదు ఆడుతున్నారు, పాడుతున్నారు...." 'ఇక చాలు ఆపు' అని పావురం మాటలు వింటున్న నెమలి ఒక అరుపు అరిచింది. దాని కేక వికారంగా ఉంది. పావురం మాటలు ఆపి నిశ్శబ్దంగా ఉండిపోయింది. ఎదుటి వారి ఔన్నత్యాన్ని చూసి, విని ఓర్చలేని నెమలి అహంకారం చూసి 'నీ పొగరణిగే సమయం వస్తుందిలే' అని మనస్సులో అనుకుంటూ అక్కణ్ణించి కదిలి వెళ్ళి పోయింది. ఎన్నడూ తన గురించేగాని

పరుల గురించిన ఆలోచన ఎన్నడూ రాని నెమలికి పావురం చెప్పిన మాటలు ఇప్పుడు పదే పదే గుర్తొస్తున్నాయి. తన కన్న ఎందులో గొప్ప ఆ మూర్తి? అంతా అలాగ పరవశించి పోతున్నట్లు చెప్పింది పావురం అని గొణుక్కో సాగింది. ఇదిలా ఉండగా........ వానలు వెనకబట్టిన ఆ సమయంలో ఉన్నట్టుండి ఆకాశంలో నల్లని మేఘం అలుముకుని కనిపించింది. తళుక్కుమనే మెరుపులు మెరుస్తూ కళ్ళు మిరుమిట్లు గొలిపాయి. ఆ వెనకే ఉరుముల శబ్దం వినిపించింది. ఒక మబ్బు తునక, ఉరుముకేక, జల్లుకుంటూ కురిసే చిసుకుల రాక కావాలని కోరుకుంటున్న నెమలికి మహదానందమైంది. వడివడిగా నడుస్తూ ఆ తావుగా ఎగిరిపోయింది. ఉరకలేసే మనస్సుతో సాగిపోయిన నెమలి ఒక తావున ఆగిపోయింది. ఎవరో ఆపినట్టు. కంటికి కనిపించిన దృశ్యాన్ని కళ్ళు బాగా పెద్దవి చేసి చూస్తుండి పోయింది. "ఏమి, సోయగం? ఏమి వయ్యారం? చూసిన క్షణానే తన మనస్సుని కట్టేసిన ఆ మూర్తి చాయ అంత దూరాన్నించే మేఘంలా కనిపించి తననాకర్షిస్తే తాను వచ్చింది. ఇంతటి నెరజాణ అయిన వాడు చూస్తే చిన్నారి బాలుడు. వాని చేతిలోని వెదురుముక్క పెదవుల పై చేర్చినపుడు వేయిరాగాలు పలుకుతోంది. అదే ఉరుముల శబ్దమై తనని వివశను చేసింది. ఆ ముద్దులయ్య ఒంటిపైనుంచి వెలువడుతున్న కాంతి కిరణాలు మబ్బుల మధ్య మెరిసే మెరుపుల్లాగ ఉన్నాయి. మనోహరమైన ఆ సౌందర్యరాశి ఆకర్షణకులోనైన అక్కడ చేరి ఉన్న ప్రాణులన్నీ ఆనందలహరులలో ఓలలాడుతున్నాయి. విస్తుపోయి చూస్తుండిపోయిన నెమలికి తన అందం వాని అద్భుత సౌందర్యం ముందు సూర్యుని వెలుగు ముందు మిణుగురు పురుగులా ఉంది అనిపించింది. సుకుమారమైన వాని శరీరం ముందు తన దేహబలం ఎందుకూ కొరగాదనిపించింది. ఎందుకంటే చిత్రంగా తన కళ్ళకి ఆ బాలుడు తన కొనగోట పెద్ద కొండను నిలిపినట్టు కనిపించింది. రకరకాల జీవరాసులన్నీ వాని చుట్టి ఉండి సేవిస్తుంటే అల్పమైన తన బలగం ఎంత తీసికట్టో తెలియవచ్చింది. తను ద్వేషించే కోయిల ఆ పిల్లన గ్రోవిపాటగాని గానంతో గొంతుకలిపి పలుకుతోంది. తను అసహ్యించుకునే పాములు వాని పాటకు తలలూపుతూ పరవశించి ఆడుతుంటే తనకూ మైమరచి తల ఊపాలనే అనిపించసాగింది. రెపరెప రెక్కలు ఊపుకుంటూ ఎగిరి వచ్చి పావురం 'వచ్చావా! చూస్తున్నావుగా' అని కువకువలాడింది. నెమలికి ఇక తనలో ఏమి మిగలనట్టు సర్వమూ వాని వశమై పోయినట్టు మనస్సు తేలికయిపోయినట్టు హాయిననుభవించగా, ఆ క్షణానే ఒక గంతులో వెళ్ళి ఆ మధురమూర్తి పాదాల చెంత ఒరిగిపోయింది. తన

మనోధిపతి అయిన ఆ బాలుడు "ఇప్పుడర్థమైందా? నువ్వెంత అజ్ఞానంలో పడిపోయావో! నా అనుగ్రహం కలిగిన యీ వేళ నీలో మార్పు వచ్చింది. నిన్నుద్ధరించిన గుర్తుగా నీ అందమైన పింఛంలోని ఒక ఈకెను నా తలపై అలంకరించుకుంటున్నాను, అది ఎప్పటికీ ఆ ఉన్నతమైన స్థానంలోనే ఉంటుంది'' అన్నాడు.

**"మదశిఖిపింఛ అలంకృత చికురే''** ఎవరో ధన్యాత్ములు ఆ అందాన్ని కళ్ళారా చూసి వర్ణిస్తున్నారు. చివ్వున వెనక్కి తిరిగి చూశారు గోపకాంతలు. ముద్దులొలికే గోపబాలుని సిగముడిలో అలరారుతోంది నెమలి పింఛం. ముచ్చట పడుతూ చూసి చూసి తనివి తీరటంలేదు వారికి. మెల్లిగా కడగంటి చూపులతో స్వామిని తిలకించారు. ఎల్లరనూ ముగ్ధులను చేసే వదనారవిందం మదనావేశంతో అలసమై ఉన్నట్టు అనిపించింది వారికి. వారి మనో మందిరాలలో స్థిరనివాసి అయి ఉన్న సర్వాంతర్యామి వారి వాలు చూపుల వెనక కదలాడిన భావాన్ని కనిపెట్టాడు. గోపికా హృదయాలు సాధకుల నిలయాలు కదా! తన తత్త్వాన్ని సూటిగా గుర్తించే సత్య దృష్టిని విడిచి మాయకు లోనవుతున్నారేమోనని సద్గురు నాధుడైన పరమాత్మకు శంక కలిగింది. వెంటనే వారిని సరైన మార్గంలో నడిపించేందుకుగాను "మదనవికారంతో మంద బుద్ధులై చరించే జీవుల్ని ఉద్ధరించేందుకు అవతరించానే! ఆ కాముడు నాలో కోరిక కలిగించాడంటారా? **'నారాయణోz కామయత ప్రజా సృజేయేతి'** అని వేదం పలికినట్టుగా నాకే సృష్టి చేయాలనే కోరిక కలగటం సత్యం. ఎందుకంటారా! లోకాలన్నిటికీ అవతల పెనుచీకటి దాటితే అక్కడ వెలిగే ఏకాకృతినై ఉండటం ఎన్నాళ్ళు అనిపించింది. అందుకే నిర్గుణ నిరాకార నిరంజన నిర్వికల్పుడనైన నేను నామరూప గుణక్రియా సహితుడనై సకలమూ సృజించే స్రష్టనైనాను. అలాగ నేను, నాతో ఆడుకునేందుకు పాడుకునేందుకు మీరంతా వచ్చారు.'' అన్నాడు. మూసిన తలుపులను తెరుచుకుని గోప భామినులంతా బైటకి వచ్చే సరికి మసకచీకట్లు మాయమై బృందావనంలో చంద్రోదయమైంది. రాసలీలా విహారానికి తగిన సమయమైంది. మిగిలింది అక్కడ జీవబ్రహ్మైక్య సంధానమే!

**పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే**
**పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవాz వ శిష్యతే ॥**
**ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః**

ఇలాగ సాగిన నా వాఙ్మయ స్రోతస్వినికి జీవనమైన వ్రజనాథుడు సర్వోత్కృష్టుడై వెలయుగాక!

-సశేషం

# మౌనధ్యాన సప్తాహశిబిరం

(గత సంచిక తరువాయి) -రమణ ప్రసాద్

ఆకాశంలో ఒక అవకాశం ఇచ్చాడు భగవంతుడు. దానిని జారవిడుచుకుంటామా.

ఊహాతీతము నీ లీలా..

ఊహాపోహాలు మనస్సు వికారం. కాని మనస్సుకు ఆధారం ఆత్మయే. కరెంట్ వల్లే ఫ్యాను తిరుగుతోంది. బల్బు వెలుగుతోంది. కరెంట్ ఉన్నది అనటానికి కనెక్షన్ సరిగా ఉండాలి. అలలతో పొంగు సముద్రమే. ఇవి అకాశం నుంచే వస్తున్నాయి. మన అసలైన తత్త్వం ప్రశాంతత. చనిపోయిన తర్వాత స్థితి కాదు. మరి అశాంతి ఎలా వస్తుంది?

ఒకడు తిరుపతి వెళ్ళాడు. ఏదో ప్రోబ్లెమ్(problem) వచ్చింది. అప్పుడు ప్రశాంతతగా ఉంటుందా? వెంటనే బస్సు పట్టుకుని తిరిగి రావాలని అనిపిస్తుంది. ఒక భక్తుడు జలగలాగా వచ్చాడు జలగాం. (అక్కడ ఇటీవల గురుప్రభ పవర్ లిమిటెడ్ సంస్థ ప్రాంగణంలో కట్టిన ఆలయంలో మాతాజీవారు శ్రీ గురుదేవుల, శ్రీ గణపతి, శ్రీ ఆంజనేయస్వామి త్రిమూర్తుల విగ్రహ ప్రతిష్ఠా మహోత్సవం చేశారు) అతడు చేసిన తప్పు ఏమిటంటే సెల్‌ఫోన్ దగ్గర పెట్టుకోవటమే. అది మ్రోగింది. వాళ్ళ వదినగారు పోయినట్లు తెలిసింది. నాకు కబురు పెట్టారు. వెళ్ళచ్చా? ఉండవచ్చా? అని. పోయింది అని చెప్పారు కదా. ముందు ఆ సెల్ ఫోన్ కట్టెయ్యండి అని చెప్పి పంపాను. ఆ భక్తుడు ఆ విషయం నుండి వెంటనే డిటాచ్(detach) అయ్యాడు. దూరంగా ఉండి కార్యక్రమం అంతా చూశాడు. మరి వదినగారి కోసం ఏడ్చాడా? ఫోను వచ్చినందుకు ఏడ్చాడా?

మనస్సు తెచ్చే భావనే మనని ఏడ్పిస్తోంది. ఆ భావనలే ధ్యానం నుండి లేపెయ్యటానికి ప్రయత్నిస్తున్నాయి. అప్పుడు మనస్సును భగవద్భావన వైపు మరల్చాలి. కాయిన్ (coin) బొరుసు పడితే బంధన. బొమ్మ పడితే ముక్తి.

ఊహాతీతము నీ లీల... దానిని తెలియుట ఎవరికి తరము? తరమౌనా? పవ్వళించెను ప్రళయాంతమందు.... అన్నారు బాబు. అక్కడ పవ్వళించింది ఎవరు? బాబు కారా? తత్త్వదృష్టి అలవర్చుకోవాలి. తన తత్త్వం తను పాడుకున్నారు స్వామి. ప్రభువు అందరికీ ప్రభువే.

మనం సాగరాన్ని తల్చుకొందామా? ఆనంద సాగరంలో ఉన్న ప్రభువును గుర్తించాలి.

సాగరమా అది భక్త హృదయమా..... మంచి సువాసనలతో వచ్చే భావనలు.... అది తరమౌనె తెలియగ హరిహరాదులకైన !

ధ్యానంలో మీ భావనల వల్ల మీ కవళికలు మారతాయి. అది మీ ముఖమే చెబుతుంది. మనం పొందవలసిన స్థానాన్ని పొందుతుంటే అది సాగరమా భక్త హృదయమా! ఆ సాగరంలో ఎలా పడుకున్నాడయ్యా? ఇంకా వివరంగా చెప్తా

**వట పత్రశాయియై పసిబాలునటు తోచు**
**భుజగశయనుడై పురుషోత్తముడె యౌను**

ప్రభువు ఎంత అనంతమో అంత సూక్ష్మం కూడా. ఎందుకని? అక్కడ వటపత్రంపైన శిశువుగా పవ్వళించటం. మరి పిల్లవాడు ఆకు మీద నిలుస్తాడా? ఎందుకు సూక్ష్మమయ్యాడు? మనస్సుకు అందటం కోసం. ఆ వటపత్ర శాయిని ఒకసారి ఊహించండి. శేషశాయి చుట్టచుట్టుకుంటె దానిపై పడుకొన్నాడు. ఆ శేషశాయి భూమిని మోసేవాడు అయ్యాడు ఎందుకని? ఆ పరమాత్మను మోయబట్టి. నీ మనస్సుకు ఆధారం ఎవరు? నువ్వే ఆనందంగా అనుభవించాలి.

**భుజగశయనుడై పురుషోత్తముడె యౌను**

మరి అది సూక్ష్మమా? అనందమా? అది పత్రమా? భుజంగమా? బాలుడా? పరమాత్ముడా?

నీ కోసం పరమాత్ముడుగా కనిపిస్తున్నాడు. కాని అది అనంతమే.

అది ఏమవుతోంది? త్రికాలములయందు ప్రకాశించును.

అది త్రికాలాబాధితము. నేను నేను నేను అనేది ఏది? అసలు ప్రేమించేది దానినే. కాని కెరటాల దగ్గర ఆగిపోతున్నాం. అసలు శక్తిని గుర్తించలేక పోతున్నాం. అది గుర్తింప చేసేదే ధ్యానం. ధీయానం, అది ఇంతటితో అయిపోయేది కాదు. ఎక్కడ ఉన్నా అంతర్ముఖుడవుకా!

అది హరియించు అజ్ఞాన అంధకారమును

సాక్షిగా ఉండి అజ్ఞానాన్ని హరిస్తోంది. అది నువ్వు నమ్మిన పాదం.

ఆనంద వారిధి అతడోలలాడును......... ఊహాపోహలతో వెళ్ళకుండా లోపలికి చొచ్చుకుపోతే ఆనందం దొరుకుతుంది.

వంకాయ కూర వడ్డిస్తే అది తినటానికి నీకు యోగ్యత ఉండాలిగా. అప్పుడు ఎక్కడ ఉంటావు. ఆ పాదాల దగ్గరే ఉంటావు. అసలు మార్గానికి తెచ్చే యానమే బుద్ధి ప్రయాణం. నిన్ను గమ్యానికి చేర్చే ప్రయాణం. అది అందరినీ ఆనందంలో ముంచి తేలుస్తుంది.

ఆ ఆనందం మనం అనుభవిస్తున్నదేగా. అక్కడ ఈర్ష్య, అసూయలకు తావు ఉందా. వంకాయ కూరలాగా కాక మన స్వభావం సుభావంతో అంటే ఆత్మభావనతో (భగవద్భావతో) నిరంతరం ఊర్ధ్వపుటంచుకు పయనించగా పయనించగా ఎక్కడ మనని కూర్చో బెట్టు కొంటారు? తన ఒళ్ళో కూర్చో బెట్టుకుంటారు. ఆ చిరుపాదాల దగ్గర మనం ఉండమా. తండ్రి ఆస్తికి వారసుడు తనయుడు. అలాగే భగవంతుని నిధికి వారసుడు భక్తుడు.

"నాకు ధ్యానంలో ఘంటానాదాలు వినిపించేవి. లోపల ఉన్నవాడు కనిపిస్తున్నాడు అని మనస్సులో వస్తే ఢాం అని వీపు మీద వేశారు బాబు. ఏమిటి ఈ మాత్రానికేనా. ఇవి మనస్సు చేసే చిత్కాళలేగా అన్నారు బాబు."

సృష్టిని మార్చలేం. కాని దృష్టిని మార్చగలం. ఏకాంతే ద్వైత వర్జితే. ఏకాంతంలో ధ్యానం చేయాలి. ఉన్నది ఒక్కటే అనే భావన కలిగితే... ఒక్కటే ఉన్న భావన కలుగుతుంది. అట్టి శక్తిని భక్తిని సాధన ప్రపత్తిని గురుదేవులు ప్రసాదించుగాక! సుఖీభవ! సుఖీభవ!

**ఠుమక్ చలత రామచంద్ర బాజత్ పైజనియా**

మనం ఒక గుడికి వెళ్తాం. అందులో ప్రతిష్ఠింపబడిన మూర్తి ఎవరో తెలియ చేసేవాడు మనలోనే ఉన్నాడు.

**ధ్యానమూలం గురోర్మూర్తిః -** గురుగీత

ఎందుకు మూర్తి కావల్సి వచ్చింది? అది అమూర్తత్వమే. నువ్వు ఈ రూపాన్ని నమ్మావు కాబట్టి "పోన్లేరా! నీ తోవకు నే వస్తా" అని దేహాన్ని దాటి రాలేకపోతున్న మనకు ఒక సుందర రూపం ధరించి వచ్చి దర్శనం ఇచ్చారు.

**పూజామూలం గురోః పదం**

పాదములు అంటే గురుపాదాలు. పూజ అనుకొంటే ఎన్ని సమకూర్చుకోవాలి? ద్వైతం అంటే సీతారాములు, రాధాకృష్ణులు, జీవ బ్రహ్మలు, గురుశిష్యులు. నీకు నాకు భేదం లేదని గుర్తించి 'త్వమేవాహం' అని అనుభవ పూర్వకంగా తెలుసుకోవటమే అద్వైత స్థితి.

నువ్వంటే నాకు చాలా ఇష్టం అంటాం. అది ఏది నేను? ఈ మేనుని 'నేను' అనుకుంటున్నాం. కాని ఆ వస్తువుకు ఆది మధ్యాంతములు లేవు.

-సశేషం

# మాతాజీ బోధామృతం

(గతసంచిక తరువాయి) - శివ ప్రసాద్

ఆంజనేయస్వామి అలా అనుభవించాడు. ఆది శంకరులవద్ద పద్మపాదులు, రామకృష్ణ పరమహంస వద్ద వివేకానంద, నివృత్తినాథుల వద్ద జ్ఞానదేవులు, విసోబా ఖేచరి దగ్గర నామదేవుడు అలా అనుభవించారు. ఎన్ని చెప్పినా ఇది నేర్చుకోవాలంటే గురుపాదములను తప్పక ఆశ్రయించాలి. గురుపదములను అనుసరించాలి, అనుభవించాలి. జీవితాలు అయిపోతున్నై. కాలం గడచిపోతున్నది. ఉన్నది ఒక్కటే పాదం. నీవు శివుణ్ణి నమ్మితే ఆ పాదాన్నే ఆశ్రయించాలి. రాముణ్ణి నమ్మితే గురు రాముడి పాదాన్నే ఆశ్రయించు. కొంతమంది తత్త్వాన్ని తలచుకొనేవారు ఉంటారు. భగవద్గీతలో భగవానుడు చెప్పాడు.

**"అవ్యక్యం వ్యక్తిమాపన్నం మన్యంతే మాముబుద్ధయః।**
**పరంభావ మాజానంతో మమావ్యయమనుత్తమమ్ ॥"**

నా అసలు స్వరూపం అవ్యక్తమైనది. ఇది ఇంద్రియాలకు అందేదికాదు. అది ఇంద్రియాలతో గుర్తింపబడేది కాదు. మహాత్ములను ఆశ్రయించి వారు చెప్పినట్లు చేస్తే తప్పక అనుభవించ గలుగుతావు అన్నాడు శ్రీ కృష్ణ భగవానుడు.

నీ వీపు నీకు కనపడనంత మాత్రాన లేదు అని చెప్పగలవా? నీకంటిని నీవు చూడగలుగుతున్నావా? నా ముఖం చూద్దామంటే కనిపిస్తున్నదా? లేకపోతే తల ఎలా ఉన్నది? పోనీ తలకాయ కనిపిస్తున్నదా? పెద్దవాళ్ళు కోప్పడాలంటే, నీ మెడకాయ మీద తలకాయ ఉందా? అంటారు.

బొట్టు కారితే మనకు తెలియటం లేదు. ఎదుటివాళ్ళు చెప్తేనే తెలుస్తున్నది. నీ కళ్ళు తెరిస్తే ఎదుటివన్నీ కనిపించేలా చేస్తున్నాడు. సర్వ వ్యాపకమైన దానిని చూస్తే అందులో నీవే ఉన్నావు. ఈ చైతన్యం కలిగిన బొమ్మ తన ముఖం చూడాలి అంటే ఇంకొక జడమైన అద్దం కావాలి. ఇంకొక దానిలో ఉన్న చైతన్యాన్ని చూసినప్పుడే నిన్ను నీవు చూడగలుగుతావు. అద్దంలో కనిపించేది జడమే. అందులో ప్రాణం లేదు. బద్ధలైన మనస్సులో నిన్ను నీవు చూసుకొని బాధపడుతున్నావు. తననుతాను తెలిసికొనే స్థితిని ప్రసాదించేది, తనను తాను తెలిసికొని అందులో ఉండే గురువు ఒక్కడే. అటువంటి గురుదేవులను త్రికరణ శుద్ధిగా ఆశ్రయించాలి. గురుదేవుడు

తను, మన, ధనములను ఇస్తావా అని ఎందుకు అడుగుతున్నాడు? మనం ఎందుకు ఇవ్వలేక పోతున్నాము? జనకుడు, శివాజీ మహరాజ్ ఎలా ఇచ్చారు?

జనకమహారాజు రికాబులో కాలుపెట్టే లోపల ఆత్మజ్ఞానం ప్రసాదించే వాళ్ళు ఎవరైనా ఉన్నారా? అని అడిగాడు. ఒక్కళ్ళూ లేవలేదు. ఆ సమయంలో వచ్చాడు అష్టావక్రమహాముని. వాళ్ళు సమయం వచ్చేవరకు దాక్కొని ఉంటారు. ఆవేదన, నిరీక్షణ ఎక్కడ ఉన్నదో సాధన అక్కడ ఉంటుంది. ఆవేదన ఎక్కడ ఉంటుందో గురుదేవులు అక్కడకు వస్తారు.

అష్టావక్రుడు ఆశీర్వదిస్తూ వచ్చాడు. జనకుడు గబగబా వెళ్ళి, ప్రభూ! రండి, దయచేయండి అని ఉన్నతాసనం మీద కూర్చోబెట్టి ఆయన పాదాలు ఆశ్రయించి స్వామీ! అన్నాడు.

**అష్టావక్రుడు -** రెడీ! గుఱ్ఱాన్ని తేవటం, రికాబులో కాలు పెట్టటమే ఆలశ్యం.

బాబూజీ నీకు ఆత్మజ్ఞానం కావాలా? క్షణంలో ఇస్తా, కాని నేను చెప్పినట్లు చేస్తే. జరగకపోతే నన్ను షూట్ (shoot)చెయ్యి అనేవారు.

ఆత్మజ్ఞానం, నీవు, రెండు లేవు. అది నీకన్నా వేరుగా లేదు.

**అష్టావక్రుడు -** నీకు ఆత్మజ్ఞానం ప్రసాదిస్తాను. ముందు గురుదక్షిణగా, నీ తను, మన, ధనాలను ఇచ్చెయ్యి అన్నాడు. జనకుడు రికాబులో కాలుపెట్టి అలాగే ఉండిపోయాడు. ఆయన తన తను, మన, ధనములను త్రికరణ శుద్ధిగా ఇచ్చాడు. ఏదో మాట వరసకు ఇచ్చినట్లు కాదు. అంతే, అష్టావక్రుడు కూడ అక్కడ నుండి వెళ్ళిపోయాడు. వాళ్ళు ఆవు పాలు పితికినంత సేపు కన్న ఎక్కువ ఒకచోట ఎప్పుడూ ఉండరు. అందరూ ఏమైంది? రాజుగారు పలకటం లేదు. కళ్ళు కూడ ఆర్పటంలేదు. ఆయన ఏమన్నా మంత్రం వేశాడా? అనుకున్నారు. వైద్యులు కూడ వచ్చారు.

గురువును ఆశ్రయించిన తరువాత నక్షత్రాలు, గ్రహాలు అన్నీ పలాయనం చిత్తగించ వలసిందే. గురుగ్రహం బలంగా ఉంటేనే మనం ముందుకు వెళ్తాం. అటువంటిది గురు అనుగ్రహం ఉంటే ఇంకా మనం దేనికి భయపడాలి?

ఆ మహాత్ముడు ఎక్కడ? అని అందరూ వెతికారు. ఆయన అనుగ్రహించారు. స్వామివారు నడుస్తుంటే వెనకవాళ్ళు రొప్పుతూ పరుగెత్తినా స్వామివారితో కలిసే వాళ్ళు కాదు. ఆయన అనుగ్రహిస్తే అప్పుడు, అప్పుడు కలిసేవాళ్ళు.

శివరాత్రికి గోదావరినదిలో పడవలమీద స్వామివారికి పూజ జరిగేది. బాబుగారు ఈ పడవలో కూర్చుంటారని, ఒక పడవలో easy chair వేసేవారు. ముందు కొందరు ఆ పడవలో ఎక్కేవారు. కొందరు నాకేమో ఆమె పని చెప్పి, ఆమె వెళ్ళి ఆ కుర్చీ దగ్గర కూర్చున్నది అని ఉడుక్కొనేవారు. ఇంకొక ఆమె ఈమె hand bag మరచి పోయినానని నన్ను పంపించి తనువెళ్ళి ఆ ఈజీ చెయిర్ దగ్గర కూర్చున్నది అని ఏడ్చేది. వీళ్ళు అలా ఏడ్చే లోపల అసలైన యదుసింహుడు వచ్చి, ఆపడవ మీద నుండి ఈ పడవ, ఈ పడవ మీద నుండి ఇంకొక పడవ, అలా చివరకు ఎక్కడో ఇంకొక పడవలో ఏ మూలనో కూర్చుండేవారు. వారికి కుర్చీ కావాలా? అంతఃకరణ పవిత్రంగా ఉంటే, అక్కడ తిష్ఠ వేసుకొని కూర్చుంటారు. ఇది ఎప్పటి మాటో?

మనం ఎన్నో విషయాలను కప్పి ఉంచుతాము. మరి కరుణ కలగాలంటే ఎంత కష్టం! తత్త్వజిజ్ఞాస కలిగితే **న గురోరధికం** అని అనుభవానికి వస్తుంది. చెప్పుకోవటం, అనుకోవటం కాదు, అయిపోవటం. *

**శ్రీ సమర్థ సద్గురు పంచాయతన యాగ సత్సంగ సప్తాహము**

కట్టమూరు గ్రామంలో ది. 21-11-2009 నుండి ది. 27-11-2009 వరకు బాబు భక్త సమాజ్ వారి ఆధ్వర్యంలో వైభవంగా జరిగింది.

శ్రీ కాళీగార్డెన్స్ వ్యవస్థాపకులు, సర్వాధిష్ఠాన చైతన్య స్వరూపులు శ్రీశ్రీశ్రీ హనుమత్ కాళీ వరప్రసాద బాబూజీ మహరాజ్ వారి పరమ అనుగ్రహంతో, శ్రీ కాళీగార్డెన్స్ పీఠాధిపతులు, పూజ్య యోగిని శ్రీ చంద్రకాళీ ప్రసాద మాతాజీవారి దివ్య ఆశీస్సులతో బహుయాగ నిర్వహణానుభవ సిద్ధుడైన బ్రహ్మశ్రీ కొండూరు రామసుబ్రహ్మణ్య ప్రసాద్‌గారి బ్రహ్మత్వంలో లోక కళ్యాణార్థం శ్రీ సద్గురు గణపతి, సౌర, రుద్ర, చండీ, విష్ణు యాగము పంచరాత్ర విధానముగా జరిగినది. అశేష భక్త జనావళి యాగ కార్యక్రమములలో, సత్సంగ సమావేశములలో పాల్గొన్నారు. ప్రతిరోజు ఉదయము, సాయంత్రము భక్త సమారాధన జరిగినది.

సత్సంగ సమావేశములలో పూజ్యశ్రీ మాతాజీవారు పరమ పూజ్య 108 దండి నిర్మలానంద స్వామివారు(అష్టలక్ష్మి పీఠం, తెనాలి), పరమ పూజ్య ఆచార్య శ్రీ శంకరా నందగిరి స్వామివారు (పరబ్రహ్మ ఆశ్రమము, పెనమలూరు), పరమ పూజ్య మాతా పరావిద్యానందగిరి(యాచారం), భక్త సోదర సోదరీమణులు తమ దివ్య సందేశాన్ని అందించారు. ది. 27 తేదీన జరిగిన శ్రీ సద్గురు దేవుల పాదపూజలో అశేషంగా భక్తులు వచ్చి శ్రీ సద్గురు దేవుల మరియు శ్రీ మాతాజీవారి ఆశీస్సులు పొందారు. *

# మాతాజీ సత్సంగ్ డైరీ

(గతసంచిక తరువాయి) -రమణ ప్రసాద్

తీసికెళ్ళినవాడు ఫలానా, ఫలానా అని చూపెట్టాడు. అర్జునుడికి బోధ చేసే సమయం ఆసన్నమైంది. భగవద్గీత ప్రథమాధ్యాయం 'అర్జున విషాద యోగం' అయింది. అందరి సాధన ఏడ్పుతోనే మొదలౌతుంది. పుట్టిన శిశువు బాగా ఉన్నాడు అని తెలియాలి అంటే పుట్టగానే వాడు గట్టిగా ఏడవాలి. ఏడ్వక పోతే గిల్లి అయినా ఏడిపిస్తారు. జీవితం పుడుతూనే ఏడుపుతో స్టార్ట్ (start) అవుతుంది. అర్జునుడు పట్టించుకొనేవాడి దగ్గర ఉన్నాడు గనుక కృష్ణుడి పాదాలు పట్టుకున్నాడు. అప్పుడు జరిగింది బోధ.

గురుదేవులను మనం కూడ అడుగవచ్చు, కాని అడగం. ఎందువల్ల? ఎవరు అడ్డు వస్తున్నారు అడగటానికి? బయటవాళ్ళెవ్వరూ రావటంలేదు. నీ మనస్సు నీకు అడ్డం రాకుండా ఉంటే చాలు. నీ మనస్సు విషయం కాకుండా ఉంటే చాలు. అప్పుడు శమము, దమము, తితీక్ష, ఉపరతి, శ్రద్ధ, సమాధానము అనే ఆరుగురు వస్తారు. ఎప్పుడు వివేకవైరాగ్యాలు వస్తాయో, అప్పుడు కామక్రోధాదులనుండి విడువబడి మనస్సు అమృతమయమౌతున్నది.

శమం అంటే అంతరింద్రియ నిగ్రహం. ఇదేదో కేవలం పాఠంకాదు. బాగా ఆలోచించండి. దమం అంటే బాహ్యేంద్రియ నిగ్రహం. రెండిటిలో శమాన్నిముందు పెట్టాడు. ఎప్పుడు అంతరింద్రియాలు కంట్రోల్(Control)లో ఉంటాయో అప్పుడు బాహ్యేంద్రియాలు అంటే జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు అనుసరించి వస్తై. లోపలదానిని వదలి బయటవాటిని కంట్రోల్‌లో పెడితే, ఆ లోపలిది ఊరుకోదు. అది లోపల లోపల వ్యసనాలచుట్టూ తిరుగుతూ ప్లాన్లు వేస్తుంది. మీకూ ప్లాన్లు ఉన్నై, ఆ పనికి ఎవరిని పంపాలి, ఇది ఎవరికి అప్పచెబితే పని అవుతుంది వంటివి.

ప్రపంచ వ్యవహారం పెట్టుకున్నంత వరకూ బంధనే. కేవలం బాహ్య సన్యాసం మాత్రమే చాలదు. ఆంతరిక సన్యాసం కావాలి.

సన్యసస్య శ్రవణం కుర్యాత్ అన్నారు. కాని ఇప్పుడు కలిగినది తాత్కాలిక సన్యాసం మాత్రమే. ఈ గంటన్నర మాత్రమే. లేదా మహా అయితే ఈరోజు వరకు మాత్రమే. తరువాత లేదు. తెల్లవారగానే పక్షుల కూతలు మొదలు అవుతై. ఇక ఒకదాని తరువాత ఒకటి జగత్తుకు సంబంధించిన

వ్యాపారాలు మొదలు అవుతై. ఇవి ఇనుప సంకెళ్ళు అయితే, ఆశ్రమానికి సంబంధించినవి బంగారు సంకెళ్ళు. రెండూ బంధనే.

గృహస్థాశ్రమంలో ఎంతవరకో అంతవరకే, ఆశ్రమం ఎంత వరకో అంతవరకే. ఎవ్వరికీ ఎవ్వరూ ఏమీ కారు. కనుకనే పెద్దలు ఏమన్నారు?కోzహం? నేను ఎవరిని అని విచారణ చేయాలి. నేను ఈ శరీరాన్నా? ఈ శరీరం నేను అనటంలేదు. నాది అంటున్నాము. మనస్సు ఉత్సాహంగా ఉన్నా, దేహం పరుగెత్తనీయదే? ఇంద్రియాలు నావి అనుకుంటున్నాము కాని పులిహోర బాగుంది, ఇంకొంచెం తిందాము అనుకుంటే కుదదటంలా. దేహం తినగలుగుతున్నదా? నేనెవరిని? నాదేహం, నాకాలు, నామెడ, నా ప్రాణం అంటున్నాము. అంటే అవేవీ నేనుకాను అనేగా? ఇంతకూ నేను ఎవరిని? ఆ పరమాత్మ అనుగ్రహం ఇందులో చైతన్యం రూపంలో పెట్టాడేమో, ఆ ఆత్మ లేదా చైతన్యం నేను. ఆ ఆత్మనేరుగా కనిపించదు. ఉపాధిని చూస్తేనే కరెంట్ ఉన్నదో లేదో తెలుస్తుంది. లైటు పెడితే వెలుగుతుంది. ఫ్యాన్ పెడితే తిరుగుతుంది. అలాగే 'నేను' కూడ ఉపాధిద్వారా తెలియబడవలసిందే. మరి ఇంతకీ కోzహం? నేనెవరిని? రమణమహర్షివారి సిద్ధాంతం కూడ అదే. నేను ఈ దేహాన్నా? నేను వెంకటరత్నాన్నా? అని మననం చేయగా చేయగా నాహం దేహం, నేను ఈ దేహంకాదు, అది నాకు భిన్నంగా ఉన్నది. ఈ దేహానికి అనారోగ్యంగా ఉండటం, ఆరోగ్యంగా ఉండటం, బాల్యము, యౌవనం వంటి అవస్థలు ఉన్నాయి. అవి నాకు లేవు గనుక, నేను దేహం కాదు.

నేను దేహంకాదు అనగానే మనస్సు వచ్చి కూర్చుంటుంది. ఆ మనస్సు కూడ నేను కాదు అని తెలియగానే, నీవు మహాత్ములమాటలను సరిగ్గా గ్రహిస్తావు. సోzహం అంటే ఆ పరమాత్మే ఇందులోనూ ప్రకాశిస్తున్నాడు, నా ప్రభువే దీనిని అనుభవించే శక్తిని ఇచ్చాడు. ఆ పరమాత్మే తాను అనుకోవటంలో విషయం ఉందా?

శమము అంటే ముందు అంతరింద్రియ నిగ్రహం. తరువాత దమము, అంటే బాహ్యేంద్రియ నిగ్రహము. తరువాత ఉపరతి అంటే ఆ ఆనందాన్ని అనుభవిస్తూ అందులోనే ఉండిపోవటం. మన బాబుపైన అనురక్తిని పెంచుకుంటే, అనంతంలోని మనస్సు కూడ అంతర్ముఖం అవుతుంది. తను అనంతంగా నిలబడాలి అంటే మనస్సు ఆ అనంతశక్తిని పొందుతున్నది.

-సశేషం

## శ్రీ బాబూజీ దివ్యవాణి

రామసోదరుల ఈ త్యాగమయ జీవిత గాథలన్నీ ఆధునికుల బుద్ధికి అర్థరహితమైన విడ్డూరాలుగా చూపట్టవచ్చును. రాజ పదవికి వరించబడి పట్టాభిషిక్తుడు కానున్న పురుషుడు, తన తండ్రి యేనాడో తన ముగ్గురు భార్యలలో నొకతెకు కామవివశుడై యిచ్చిన అర్థరహిత వాగ్దానమును చెల్లించుటకై చక్కని రాజ్యాధికారమును విడనాడిపోవుట విజ్ఞతా రహితమైన పనిగా వారికి తోచడం సహజం.

అంతేకాదు, అంతఃపుర సౌఖ్యములనన్నిటినీ విడనాడి, ఎండ కన్నెరుగని యొక రాకుమారి కేవలం తాను పతివ్రతననిపించుకోడానికై భర్త వెంట అలా అడవులబట్టి పోవడం ఏమి విజ్ఞత? అటులనే ఒక రాకుమారుడు తాను క్రొత్తగా పెండ్లాడిన భార్యనూ, అందివచ్చిన అంతఃపుర భోగ జీవితాన్నీ వదలుకొని, అన్నా వదినల వెంట అడవుల బట్టిపోయి, తానూ బ్రహ్మచారిగా జీవిస్తూ, నిద్రాహార సౌఖ్యాములు వర్జించి, ఆ యిరువురికీ అంగరక్షకుడుగా జీవితం గడపనెంచడం ఎంత తెలివి?

ఈ విధంగా ఆలోచించే ఆధునికుల అజ్ఞాన గాఢత్వానికి మనం జాలి పడడం తప్ప అంతకంటె ఏమీచెయ్యలేము. అతి సున్నితమైన హిందూ ధర్మజీవనపు విలువలను గురించి వీరికేమి తెయును? 'మాతృదేవోభవ', 'పితృదేవోభవ' అనే హెచ్చరికలోని ఘనత వీరికెలా అర్థమవుతుంది? హిందూ వివాహ బంధంలోని మాధుర్యమూ, పవిత్రత వీరికెలా అవగాహన మవుతాయి? సేవామయ, త్యాగమయ జీవితాలలోని సంతృప్తినీ, ఆనందాన్నీ వీరెలా తెలుసుకో గలుగుతారు?

అశాశ్వతమైన సుఖంకోసమూ, ధనం కోసమూ అత్యంత సన్నిహితులగు బంధుజనులను సైతం అవమానించుటకూ, ద్వేషించుటకూ, హింసించుటకూ మాత్రమే అలవాటుపడి, స్వార్థపరత్వంలో మునిగియుండే వారికి ఈ ధార్మిక జీవనపు ఘనతలో మూల్యము లెంత మాత్రమూ తెలియబడనేరవు.

ఉదారత, ఉత్తమ శీలము, కర్తవ్య పరాయణత్వము, త్యాగము, సహనము ఈ మొదలైన ఆదర్శ గుణాలకూ ఉదాహరణములుగా నిలిచే నిమిత్తమే రాముడూ, రామపత్ని, రామసోదరులు బాధ్యతలెరిగిన మానవులుగా తమతమ పాత్రలను లోకమున నిర్వహించినారు. దివ్య శక్తులు వారికున్ననూ,

తమ వ్యక్తిగత ప్రయోజనముల నిమిత్తమై వాటినెన్నడూ వారు ఉపయోగించుకోలేదు. శ్రేష్ఠులగువారి ఆచరణను సామాన్య జనులు భక్తి విశ్వాసాలతో అనుసరిస్తూ ఉంటారని వారెరుగుదురు. జీవితపు ఒడుదుడుకులన్నిటినీ ధీరత్వంతో ఎదుర్కొనుటకే అట్టి మహనీయులందరూ ఉత్సహించినారు. జీవితమును ఎదుర్కొనే మార్గ మిదియేయని లోకమునకు తాము ఆచరించి చూపుటయే వారి పరమ లక్ష్యం.

శ్రీరాముని వలె శ్రీకృష్ణుడు కూడ శ్రీమహావిష్ణు అవతారమే. ఈ అవతారంలో ఆయన కొన్ని అతీత శక్తులను ప్రదర్శించిన మాట నిజం, కానీ దుష్టత్వమును వెంటనే అరికట్ట వలసిన అరుదైన సందర్భాలలో మాత్రమే అట్టివి ప్రదర్శించ బడినవి. వ్యక్తిగత ప్రయోజనములకై వీటిని ప్రదర్శించడం జరుగదు.

శ్రీరాముని వలెనే శ్రీకృష్ణుడు కూడా ఆదర్శ మానవ జీవితమునే లోకమునకుదాహరణ ప్రాయంగా నడుపుతూ వచ్చినాడు. గురువును సంతోష పెట్టుటకు ఆదర్శ శిష్యుడై మెలగినాడు. సంఘ విద్రోహ శక్తులనణచి లోక సంగ్రహమొనర్చుటకు ఏ నాడూనూ విసుగొందలేదు. తనను నమ్ముకున్న బంధుజనులను వారి ఆపత్కాలంలో సదా ఆదుకొంటూనే వచ్చినాడు. ధర్మ పక్షమున నిలిచి నిత్యమూ దానికై బలమును ఘటింపజేస్తూ వచ్చిన ఆదర్శ రాజతంత్రజ్ఞుడాయన. ఆపత్కాలమున రక్షకుడై ఉండిన ఆప్త సఖుడు. నీవే దిక్కని నమ్ముకొన్న వారికి ఎడతెగని ప్రాపు, తనను ప్రేమించినవారిపై ప్రేమామృతమును వర్షించు ప్రేమసింధువు. తనను ఆశ్రయించిన శిష్యుని తనయంతవానిగా జేసుకొనే పర్యంతం విశ్రమించ నొల్లని ఆదర్శ గురువు. *

## విజ్ఞానం పంచటానికి విదేశాలకు శ్రీ మాతాజీ

డిసెంబరు నెలలో మెల్‌బోర్న్, ఆస్ట్రేలియాలో జరుగు **వరల్డ్ పార్లమెంట్ ఆఫ్ రెలిజియన్స్** కాన్ఫరెన్స్‌లో పాల్గొనుటకు పూజ్యశ్రీ మాతాజీవారు డిసెంబరు 3న బయలుదేరి 4న ఆస్ట్రేలియా చేరుకొని డిసెంబరు 6వ తేదీన **మెడిటేషన్ అండ్ సేక్రెడ్ మ్యూజిక్** ప్రోగ్రాములో పాల్గొంటారు. 8వ తేదీన **షేరింగ్ విజ్‌డమ్ ఇన్ సెర్చ్ ఫర్ ఇన్నర్ పీస్** అనే కార్యక్రమంలో పాల్గొంటారు. న్యూజీలాండ్, హాంగ్‌కాంగ్ దేశాలు సందర్శించి డిసెంబరు 27 న స్వదేశమునకు తిరిగి వస్తారు. *

# సమర్థ సద్గురు నాథుని దివ్య చరిత్ర

(గత సంచిక తరువాయి) - స్వామి విజయేశ్వరానంద ప్రసాద్

అలా శ్రీ బాబు నిర్హేతుక కటాక్షం వలన కుదుటపడి యిప్పటికీ వర్ధిల్లుతున్న కుటుంబాలు అసంఖ్యాకంగా ఉన్నాయి. కాని ఎవరైనా శ్రీ బాబుతో యీ ప్రస్తావన తెచ్చినప్పుడు "వారుకూడా జగన్మాత బిడ్డలే, కనుక నా సోదరులే. వారి కష్ట సుఖాలలో పాలుపంచుకోవటం నా కర్తవ్యమే గాని ఉపకారం అనిపించుకోదు" అనేవారు.



యాత్రా సమయాలలో శ్రీ బాబు సాధువులతో పరిచయం చేసుకుని వారితో ప్రయాణిస్తూ, అవకాశం చిక్కినప్పుడల్లా వారితో తత్త్వ విచారణ జరిపే వారు. ఆ సాధువులు కూడా శ్రీ బాబుతో సంభాషణ సాగుతున్న కొలది వారి ఆధ్యాత్మికౌన్నత్యమును గుర్తించి, వారితో సాంగత్యమును మరింతగా అభిలషించే వారు. అందువలన భోజన భాజనాదులలో ఆ సాధు బృందం వారి ఆతిథ్యం కూడా శ్రీ బాబుకు తరచు లభిస్తూ ఉండేది.

ఒకసారి కొందరు మిత్రులతో శ్రీశైలం వెళ్ళినప్పుడు శ్రీ బాబు భీముని కొలను దర్శించటానికి వెళ్ళారు. స్నానం చేద్దామని కొలనులో దిగిన మిత్రులలో కొందరు ఊబిలో చిక్కుకున్నారు. శ్రీ బాబు తాము కట్టుకున్న పంచను వారి వైపు విసిరారు. వారు దాన్ని అందుకుని స్వామి సహాయంతో బయటకు రాగలిగారు.

శ్రీ శైల మహా క్షేత్రము, అక్కడి వివిధ ప్రదేశములు, పరిసరములు, కొండలు, కొలనులు, గుట్టలు, గుహలు - ఒకటేమిటి? అక్కడి ప్రతి అణువు స్వామికి ఎంతో సన్నిహితము, ఆత్మీయము అయినది; ఎన్నో మధురమైన స్మృతులను కలిగించేది. తరువాత కాలంలో శ్రీ బాబుతో శ్రీశైలయాత్ర చేసిన భక్తులను శ్రీ బాబు వెంటబెట్టుకొని వెళ్ళి, కాలి నడకతో ఆ ప్రాంతాలన్నీ చూపించి ఆ యా స్థల విశేషాలను, తమ అనుభూతులను వివరిస్తుంటే, భక్తులు పరిసరాలను మరచి ఏ దివ్యలోకం లోనో, తపోవనం లోనో విహరిస్తున్నట్లు

అనుభూతి పొందే వారు. ఒక్క శ్రీశైలమే కాదు, ఏ క్షేత్ర యాత్ర చేసినా శ్రీ బాబుతోనే చేయాలి. అలా చేసిన వారికి, అందులోనూ వారితోబాటు, ఎన్ని మైళ్ళు నడిచామనే దృష్టిలేకుండా తిరిగిన వారికి ఆ యాత్ర చేసినందుకు సార్థకత కలిగేది. ఇది నేను (రచయిత) స్వానుభవ పూర్వకంగా వ్రాస్తున్నాను. క్షేత్రజ్ఞుడైన స్వామికి తప్ప మరొకరికి ఆ క్షేత్ర వివరములు, రహస్యములు అంత కూలంకషంగా అవగాహన కాజాలవు.

భద్రాచలం సమీపంలో ఉన్న పాపి కొండలలో శ్రీబాబు ఎంతో కాలం తపస్సు చేశారు. మహాత్ములొకరు ఆ ప్రాంతంలో శబరి ఆశ్రమంలో తమ శిష్యులతో నివసించేవారు. ఆయన శ్రీ బాబును ఎంతో అభిమానించేవారు. అప్పుడు శ్రీ బాబు బాల్యదశలోనే ఉన్నందున, ఆ మహాత్ములు వాత్సల్యంతో ఆదరించారు. అప్పటికే శ్రీ బాబులో ప్రజ్వరిల్లిన తీవ్ర తత్త్వ దర్శన పిపాసను, ధ్యానంలో అనన్యమైన ఏకాగ్రతను గుర్తించి, ఎంతో ఆత్మీయ భావంతో ప్రత్యేక ఆదరణ చూపారు.

స్వాములవారి శిష్యులు అసూయతో శ్రీబాబును ఎలాగైనా అవమాన పరచి పంపివేయాలని ప్రయత్నించారు. స్వాములవారు తగిన సమయంలో తగిన విధంగా వారికి బుద్ధి చెప్పి, శ్రీబాబు ఔన్నత్యాన్ని గుర్తింపజేసే వారు. అలా కొంతకాలం సాధన చేసిన తరువాత, ఒకప్పుడు తాము తపస్సిద్ధిని పొందలేకపోయామనే ఆవేదనతో శ్రీబాబు నిరుత్సాహపడి, జీవితం చాలించవలెననే భావనతో ఒక ఎత్తైన కొండ శిఖరం పైకి వెళ్ళి, అక్కడ నుండి క్రింది లోయలో ఎంతో లోతున ఉన్న గోదావరి లోనికి దూకే ప్రయత్నం చేశారు. కాని కరుణామయి అయిన జగన్మాత లోక సంరక్షణార్థం అవతరించిన తన కుమారుని తన ఒడిలో చేర్చుకొని రక్షించిందా అన్నట్లు గుబురుగా ఉన్న ఒక చెట్టు కొమ్మల మధ్య పడి శ్రీబాబు నిరపాయంగా ఉండిపోయారు. అంతలో ఆ మహాత్ములు త్వరపడుతూ వచ్చి, శ్రీబాబును దగ్గరకు తీసుకొని, "నాయనా! నీవు కారణ జన్ముడవు. నీ వలన ఎంతో లోకోద్ధరణ జరుగవలసి ఉన్నది. ఆత్మానందాన్ని పొందాలనే తీవ్ర ఆవేదనలో నీవు నీ తపస్సు ఫలించలేదనే భావించావుగాని, ఇంత బాల్యంలో, ఇంత స్వల్ప కాలంలో, ధ్యానంలో నీవు పొందిన పరిణతి మహాయోగులకు మాత్రమే లభిస్తుంది. ఇక నీవెన్నడూ ఇటువంటి తొందరపాటు పడవద్దు. అనతి కాలంలోనే నీవు

ఆత్మజ్ఞాన పరిపూర్ణుడవై లోకోద్ధారకుడవు కాగలవు. ఈ ఆపద నుండి నిన్ను జగన్మాత రక్షించిన తీరు చూస్తేనే, ఆ జగజ్జనని నీ ద్వారా ఎంత లోక కళ్యాణం కలిగించ సంకల్పించినదో విశదమవుతున్నది. రెట్టించిన ఉత్సాహంతో నీ సాధన కొనసాగించు. క్షిప్రమేవ పరిపూర్ణ ఫల సిద్ధి రస్తు" అని ఆశీర్వదించారు. తరువాత శ్రీబాబు సాధన మరింత తీవ్రమైంది.

శ్రీబాబు మానవాళి మధ్యకు వచ్చిన తరువాత కూడా చాలా సార్లు, పాపికొండలలో తమ సాధనను, ఆ స్వాములవారి సాహచర్యాన్ని స్మరించుకుని, ఆనంద పడేవారు. భక్తుల యిళ్ళలో ఉంటూ ఉన్న శ్రీబాబు ఏ అర్ధరాత్రి వేళనో వెళ్ళిపోయేవారు. తిరిగి వచ్చిన తరువాత పాపికొండలలో కొన్నాళ్ళు గడిపి వచ్చామని చెప్పేవారు.

శ్రీబాబు తమ పర్యటన కాలంలో అరుణాచలం వెళ్ళి భగవాన్ శ్రీ రమణ మహర్షిని దర్శించారు. రమణాశ్రమమును దర్శించ వచ్చే భక్తులకు భోజనశాలలో ఉచిత భోజనపు ఏర్పాటు ఉంది. శ్రీరమణ మహర్షి కూడా భోజనశాలలోనికే వచ్చి, భక్తులతో కలిసి నివేదన చేసుకొనేవారు. శ్రీబాబు రమణాశ్రమమునకు వెళ్ళిన కొద్ది సేపటిలోనే, భోజనశాలకు వెడుతున్న శ్రీరమణ మహర్షి దృష్టి శ్రీబాబు పై పడింది. బ్రహ్మ తేజస్సు ఉట్టిపడుతున్న ఈ బాలుని చూడగానే శ్రీరమణ మహర్షికి అమితానందం కలిగింది. శ్రీబాబు దగ్గరకు వచ్చి చెయ్యి పట్టుకుని"కుట్టీ! ఇంగే వా అప్పా" అని తీసికొనివెళ్ళి తమ ప్రక్కనే భోజనానికి కూర్చుండబెట్టుకున్నారు. ఆరాధనా భావాన్ని వ్యక్తం చేస్తున్న శ్రీబాబు చూపులు, ఆత్మీయ భావంతో కూడిన వాత్సల్యాన్ని వర్షిస్తున్న శ్రీమహర్షి చూపులు మౌనంగానే మాట్లాడుకున్నాయి. మౌన వ్యాఖ్యతోనే పరబ్రహ్మతత్త్వమును పరస్పరం వెల్లడించుకున్నాయి.

శ్రీరమణాశ్రమంలో శ్రీ బాబు సుమారు ఒక వారం రోజులున్నారు. ప్రతిరోజూ రెండు పూటలా శ్రీరమణమహర్షి, భోజనం వద్ద శ్రీబాబును తమ ప్రక్కనే కూర్చుండబెట్టుకునేవారు. అక్కడి కార్యకర్తలు శ్రీమహర్షి ప్రక్కన యితర ముఖ్య అతిధులనెవరినో కూర్చోబెట్టే ప్రయత్నం చేశారు. కాని శ్రీబాబును మాత్రం మహర్షి తమ ప్రక్కనుండి కదలనీయలేదు. చివరకు శ్రీబాబు సెలవు తీసుకోవటానికి వెళ్ళినప్పుడు శ్రీమహర్షి శ్రీబాబును దగ్గరకు తీసుకుని, చుబుకం నిమిరి, దరహాస వదనంతో వీడ్కోలు పలికారు.-సశేషం




(గతసంచిక తరువాయి) -రమణ ప్రసాద్

ఉద్ధవా! అక్రూరుడు పిలిచాడు. ఆయన కంఠస్వరంలో ఎంతో మార్పు వచ్చింది. ఈ నిశీధిలో కూడా ఆయన పలుకులు దుస్సహంగా ఉన్నాయా అన్నట్లుగా రాత్రి చీకటి ఇంకా గాఢమైంది. "ఏ క్షణం కంసుడు నన్ను తన మంత్రిమండలిలో చేర్చుకున్నాడో, అప్పుడే నేను ఆ పదవి స్వీకరించకుండా ఉండాల్సింది. తిరిగి గణతంత్రస్థాపన కోసం పోరాటం ప్రారంభించి ఉండాల్సింది. నిర్భయంగా ఎదిరించి నిలిచే బదులు నన్ను నేనే మోసగించుకున్నాను. వెంటనే సంఘర్షణ చేయటం కన్న, తగిన సమయం కోసం ఎదురు చూస్తూ కంసునికి అతి విశ్వాస పాత్రుడిగా ఉండి భవిష్యత్తులో ఏదో ఒక మార్గం చూడాలి అని సమాధాన పడ్డాను. కాని ఆ ఆలోచన సరికాదు. నన్ను నేను రక్షించుకోవటం కోసం భయం కొద్దీ అలా చేశాను. కాపురుషత్వాన్ని కప్పిపుచ్చటాని గణతంత్రం! గణతంత్రం! అని నినాదాలు చేశాను. అసత్యానికి మద్దతు ఇవ్వటం కన్న అన్యాయాన్నిఎదిరించి సత్యస్థాపన చేసి సత్యాన్ని వెలుగులోకి తీసుకురావచ్చు అన్న విషయం నాకు తెలిసి కూడా నేను దానిని ఆచరించలేక పోయాను..."

"సత్యాచరణ అసిధారావ్రతం. కత్తిమీద నడక వంటిది. ఇది ఎంత కఠోరమో అందరికీ విదితమే?" అన్నాడు ఉద్ధవుడు శాంతి పూర్వకంగా.

"కంసుడు నన్ను గోకులం వెళ్ళి కృష్ణుణ్ణి తీసుకుని రమ్మని ఆజ్ఞాపించి నప్పుడు నేను ఆ ఆజ్ఞను తిరస్కరించి ఉండాల్సి ఉంది. కృష్ణుని శక్తి సామర్థ్యాల గురించిన వార్తలు రోజూ మధురలోని రాజ్య సభకు వస్తూ ఉండేవి. కాని కంసుడు కంసుడే! రాజ సభకు వచ్చిన కృష్ణుణ్ణి అతడు తప్పక చంపుతాడు అన్న విషయంలో నాకు కొంచెం కూడా సందేహం లేదు." అక్రూరుడు తాను చేసిన అపరాధానికి ఎంతో క్రుంగిపోతున్నాడు. నేను నాకు ఆత్మ చేసిన హెచ్చరికను పాటిస్తే సంఘర్షణ అనివార్యం అని సమాధాన మార్గాన్ని అవలంబించాను. కృష్ణుడు ఒక విరాట్ వ్యక్తిత్వం గలవాడు. ఇప్పుడు నేను

కంసుని ఆజ్ఞను పాటించక పోతే నాకు పట్టే దుర్దశ ఎలాగు పడుతుంది. కంసుడు వేరే పన్నాగంతో కృష్ణుణ్ణి ఎలాగూ తీసుకువస్తాడు. దైవానుయోగం చేత కృష్ణుడే కంసుని హత్య చేస్తాడు. కృష్ణుని చేతిలో కంసుడు మరణిస్తే కృష్ణుణ్ణి మధురకు తెచ్చిన కీర్తి తనకే దక్కుతుంది. స్వయంగా కీర్తి లక్ష్మి తనకు విజయ తిలకం దిద్దటానికి ఎదురుగా నిలిచింది... అలాంటప్పుడు నేను వెన్ను చూపడం అవివేకం? కృష్ణుడు విజయం సాధిస్తే గణతంత్ర పునస్థాపన జరిగితే నా స్థానం, నాకు జరిగే గౌరవ మర్యాదలు సురక్షితంగా ఉంటాయి..! ఉద్ధవా..'' అక్రూరుని గొంతు తడబడింది, "నేను... నేను ఒక వ్యాపారిని అయిపోయాను ఉద్ధవా... వ్యాపారిని అయిపోయాను! కృష్ణుని హత్య చేసే పన్నాగంలో నేను భాగస్థుడిని అయ్యాను. వ్రజభూమి ప్రజానీకాన్ని, గోకులంలోని నిర్దోషులైన గోపాలకులను, స్వయంగా నందగోపుని... అందరిని నేను మోసగించాను! విశ్వాస ఘాతకుడనైనాను.

తండ్రీ! ఉద్ధవుడు అక్రూరుని చరణాలపై చేయివేసి ఇలా అన్నాడు. కృష్ణునిపైన మీకున్న విశ్వాసం అది సత్యం అని నిరూపించబడింది కదా. అది సంతోషకరమైన విషయం కాదా! నందుడు, గోపవాసులు కృష్ణ, బలరాములను నీ చేతిలో ఉంచారు కదా. తమ వాసుదేవునికి సన్నిహితునిగా, అంధక కులానికి పూజనీయుడుగా.....''

"ఆగు ఉద్ధవా! ఆగు! దయచేసి అలా నాతో మాట్లావద్దు!'' కృష్ణుని సామర్థ్యంపైన నాకు నమ్మకం ఉన్నది. కృష్ణుడు కంసుని సంహరిస్తాడు అనే మంచి భావన నాలో పూర్తిగా ఉంది... కాని ఇతిహాసం భావనలతో వ్రాయబడదు. అది ఆచరణను బట్టి వ్రాయబడుతుంది ఉద్ధవా! నా ఆచరణ శుద్ధంగా లేదు...''

ఉద్ధవుడు నిరుత్తరుడైనాడు. దీర్ఘమైన జీవనం గడిపి అంతిమ చరణంలో ఉన్న అక్రూరుని ముఖస్థగా వస్తున్న మాటలు, వేదనా పూరితమై ప్రాయశ్చిత్త వారధిలో శుద్ధమై అందరిని ముగ్ధులను చేస్తున్నాయి. వారి ఇద్దరి మధ్య అఖండ శాంతి అలముకుంది.

ఉన్నట్లుండి అక్రూరుడు లేచి నిలబడ్డాడు. ఆయన శిధిలమైన శరీరం వణికింది... ఉద్ధవుడు చట్టుక్కున అతనిని పట్టుకున్నాడు. ఉద్ధవుడు ఇచ్చిన చేయూత వల్ల స్థిరబడి ఉద్యానం వైపు నడిచాడు. ఉద్యానంలో పశ్చిమదిశగా ఆయన చూపులు నిలిచాయి.

"ఉద్ధవా!'' తన వెనుకనే నీడలా నిలబడి ఉన్న ఉద్ధవునితో, "ఒక యుగంలో కంసుని సభా మండపము అదిగో అక్కడ.... అక్కడ ఉండేది....

కనిపిస్తోందా?'' అని తన కుడిచేతి చూపుడువేలు ఆ దిక్కుగా పెట్టి అన్నాడు. అక్కడ అసంఖ్యాకమైన ప్రాసాదాల మధ్య కంసుని సభామండపం ఇన్ని సంవత్సరాల తరువాత కూడా విలక్షణంగా కనపడుతోంది. రాత్రి సమయంలో ఈ మండపంపైన ఉన్న గోపురంపైన ఉన్న ధ్వజంపై నుంచి ఎగిరే జండా ఎగురుతూ చేసే శబ్దాలు ఉద్ధవునికి వినిపిస్తూనే ఉన్నాయి.

"ఈ సభామండటం ఇప్పుడు దాని ఆకారమే కనపడుతోంది. కాని ఒక సంపూర్ణ యుగాంతం తరువాత కూడా ఈ మండపంలో నేను అకల్పనీయమైన రోమాంచితమైన ఒక మహత్తరమైన ఘటనకు సాక్షిని నేనే. ఆ అమూల్య క్షణం నా మనస్సులో మెదిలినప్పుడల్లా ఆ సంఘటన తాలూకు జ్ఞాపకాలు నాముందునుంచి అవి అప్పుడే జరిగినట్లుగా అనిపిస్తుంది. వకుళ పుష్పంలాగా ముకుళించుకొని ఉన్న నా స్మృతిపైన మీరు నీరు జల్లారు. ఆ స్మృతి యొక్క రేకలు వికసించాయి. దాని సుగంధాలు గాలిలో వ్యాపించాయి.'' అన్నాడు ఉద్ధవుడు భావోద్వేగంతో.

ఉద్యానంలో లతామండపాన్ని ఆనుకొని నిల్చున్నాడు అక్రూరుడు. సంజ చీకటిలో ఆ లతల లేచిగుళ్ళపై చేతులు పెట్టి ఉద్ధవుడు ఆలోచనలలో మునిగి పోయాడు.

అష్ట కోణాలతో నిర్మించబడిన సభామండపంలో ఉన్నట్లుండి నిశ్శబ్దం తాండవించింది. మల్లులతో, ఆమంత్రితులైన వారితో నగరవాసులతో క్రిక్కిరిసి పోయిన ఆ మండపంలో నిశ్శబ్దం చోటు చేసుకొంది. చాణూర ముష్టికుల విశాల దేహాల నుండి భిన్నమైన భాగములు చిన్న కొండలలాగా మండప మధ్యంలో పడి ఉన్నాయి. కంస మహారాజు తమ్ముళ్లైన సుమాలిని బలరాముడు తన హలంతో చీల్చిన దేహం మృతప్రాయంగా పడి ఉంది. అర్ధచంద్రాకారంగా ఉన్న గవాక్షాలలో నుంచి ఈ భయానక దృశ్యాన్ని తిలకించిన స్త్రీలు గోల పెడుతున్నారు. గోకులానికి చెందిన ఈ ఇద్దరు గోపబాలకుల అంతం త్వరలో కాబోతోంది అనే దాంట్లో ఎవరికీ సందేహం లేదు.

- సశేషం

Printed, Published by C.V. Ramana Babu, on behalf of YOGINI SRI CHANDRA KALI PRASADA MATHAJI CHARITABLE TRUST and Printed at Samardha Sadguru Publications, D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh, and published at D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh. Editor - Guda Siva Rama Murthy,